Reg. No. 757.

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము7 } 1915 జులై { సంచిక 7

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 శ్రీ రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహదరు జమీందారులు నూజవీడు

2 రాజా వెంకటాద్రిఅప్పారావు బహదరు జమీందారుగారు, నూజవీడు

3 రాజా వాశిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహదరు మన్నెసుల్తాన్ జమీందారుగారు ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామశింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానముమేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

8 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి

4 హనుమంత రెడ్డిగారు-క్షీరసాగరము

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిరిదొడ్డి

6 అన్నమురాజు సుబ్బారావుగారునందూరు

7 నందూరు లక్ష్మీనరసింహారావుగారు, కరణం, నందూరు

8 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

19 మెదకు శేషారావు దేశముఖుగారు నల్లబల్లి

10 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాండవరము

11 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

12 హేజిబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

13 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద

# అభినవసరస్వతి

సంపుట 7. | జానపాడు | సంచిక 7.
రాక్షస సం॥ ఆషాఢమాసము

## కృ తి వి మ ర్శ ము.

**వాసిరెడ్డి వంశచరిత్రము:—** ఇది కృష్ణా గుంటూరు మండలములలోఁ బూర్వము వాసి గాంచిన యొక కమ్మవంగడపువారిచరిత్రము. ఈవాసిరెడ్డివంశమింత ప్రతిష్ఠ కాకరమగుట కీమధ్యరాష్ట్రమును నిర్వక్రపరాక్రమముచేఁ బాలించుటయకాక లోకోపకారకార్యములు పెక్కులాచరించి యనేక దేవాలయములు గట్టించి వర్తమానమున సత్తెనపల్లి తాలూకాలోని యమరావతిని నమూల్యమండప ప్రాకారావృతంబగు దివ్యసదనంబున మహావైభవములతో నన్వహము జరుగు నుత్సవంబులకుఁ బ్రముదితహృదయుండై భక్తులకాంక్షితంబులం దీర్చుచు వసించెడి శ్రీ అమరేశ్వరుని రూపమునను దత్తత్స్థలస్థభూమీసుగాను భూయమానభూర్యగ్రహారరూపమునను భవ్యకాయుండై విరాజిల్లెడి శ్రీ వెంకటాద్రినాయుఁడే ముఖ్యకారణము. ఆవంశమిప్పటికిని దామరతంపరగ్గు యనేక పుణ్యపురుషులతోడను సనేపలగు జమీందారులతోడను నలరారుచుఁ గమ్మమహాన్వాయమునకుఁ గరమునలంకారప్రాయమై యుండుట బహుజనవిదితము. ప్రస్తుతము కృష్ణాతీరమండలి ముక్త్యాలగ్రామమున స్వపూర్వికపరికల్పిత దివ్యాలయమందు సంతతసాన్నిహిత మహోత్సవుండగు శ్రీ ముక్తేశ్వరుని సేవించుచుఁ బద్ధయాప్రవృద్ధరాజ్యవైభవం బనుభవించుచు విద్వత్ప్రియత్వంబున వివిధవిద్వద్గోష్ఠిం దేలుచు సంస్కృతాంధ్రభాషాపోషణ శోధనిర్మాణంబొనరించుచున్న శ్రీ రాజాచంద్రమౌళీశ్వరప్రసాదబహాదరు మహాన్నసులాను గారీ వాసిరెడ్డివంశంబుననే జన్మించిరి. విద్యావృద్ధిం గోరి విద్వాంసులచేఁ బరిభపత్రికలచేఁ దమపోష్యవర్గములోఁ జేర్చుకొనిన రసికశేఖరులీ జమీందారులే. ప్రకృతపరిశీల్యమాన మహాభారతమునకుఁ గృతికర్తలయి గ్రంథకర్తలగు కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారిపై సువర్ణవృష్టిగురిపించుచున్నవారీ మహారాజులే. ఏతత్పూర్వాతులకుఁ బాత్రులగువారు కలధౌతభిత్తియేల కల్పింపరు! అప్రస్తుతమగుట వివరముగ నవసరించినది గాని తెలిచో నీభూపాలుని చరిత్రమింత కొంచెము లోమగింపవలసినది కాదు. ఇట్టిమహాపురుషులకాలవాలమయిన యీ వాసిరెడ్డి వంశ

మందే జననమంది తెనాలి తాలూకాలోని తుమ్మపూడి కాపురముగానుండిన సుబ్బాదాసు గారి చరిత్రమును లిఖించిరి. ఇది పద్యకావ్యమై రాయలుసయిజున 348 పేజీలుగలిగిన యొక పెద్దగ్రంథము. భారతభాగవతాదులయందు సూర్యచంద్రాది వంశములవలె నీగ్రంథమందీ వంశమతివిస్తృతమై కన్పట్టుచున్నది. బహుకాలమునుండి బహుగ్రామములలో వృద్ధినిబొందియున్న యేతద్వంశ్యులయానుపూర్వీక యంతయు సంతరించిన యిక్కవి సామర్థ్యము వర్ణనాతీతము. ఇందు వేదాంతవిషయమేమి యోగవిషయమేమి 100 పేజీలకుఁ దక్కువలేకయున్నది. కావునఁగవి పెద్దలసేవచే యోగవేదాంతములయందు మంచిప్రవేశము కలవాడగుటయేకాక యనుభవపరుఁడుకూడనైనట్లు కానుపించుచున్నది. ఈయన సంస్కృతాంధ్రములయందు సాహిత్యమంతగా సాధింపకున్నను సంస్కృతాంధ్రపండితుల సపర్యచక్కగాఁ జేసినే తద్గ్రంథరూపమునఁ దనకీర్తి యాచంద్రార్కము గావించుకొనెను. సంస్కర్తలు గుంటూరు టవును హైస్కూలు తెలుగుఁపండితులగు శిష్టా హనుమచ్ఛాస్త్రి గారగుటవలన నిర్దుష్టమని వేఱుగా వ్రాయనక్కరలేదు. దీనివెల రు 1-8-0 గ్రంథకర్తవద్దనే దొరకును.

సోడాబుడ్డి — ఇది సోడాలిమిటెడ్డునుగూర్చి చెప్పినయొక కందపద్యశతకము నవనాగరికులు వాడుకొను హూణభాషాపదములు తెలుగువేసి పద్యములు కడు సొంపుగ రచింపఁబడి యున్నవి "హాగ్రావనివాఁడు దున్నపోతై పుట్టుక్, తాటాకులలోనవ్రాసిరి పరాంగనఁగూడినఁ బాపమంచు" నని పూర్వకవులచేఁ జెప్పఁబడిన నిట్లిందు క॥ అడ్డమయినట్టివాండ్రెను। బుడ్డులలో సెదయొనింపిపోఁగఁ దానిక్। ఎడ్డెలయి ద్రావఁజనదని। సొడ్డులు పలుకుదు రెఱుఁగక సోడాబుడ్డీ॥ యని చెప్పఁబడి యున్నది ఇంతమాత్రమున నిది సర్వజనాంగీకార్యమనికాదు. వర్ణభ్రష్టసంపాదనకే యిట్లు చెప్పఁబడినది. కవిహృదయమిదియేయైన, క॥ విన్నను మున్నొకపదభిష, పున్నదియే ముందునీకునూరుంబెఱుక్। గొన్నట్లు మెసిపడెదవు। సున్నసునూనీసులుకా సోడాబుడ్డీ॥ యని చెప్పియుండఁడు, ఇదిగాక క॥ బలిమిఁ బ్రసంగాసంపన్క్రీగుల్కుసైనముచ గయునపుడు ప్రోద్ధతిటిక్ట్రం। కలగులుకుదేశతాంత్రసులభవుగా వోక్కా సీవుసోడా బుడ్డీ॥ యని చెప్పియుండుటచే నిది నవనాగరిక ప్రియమైన వస్తువని స్పష్టపడుచున్నది గ్రంథకర్త బందరుబుట్టాయపేటలో మెడికల్ ప్రాక్టీషనరగు కె. శేషగిరిరావు గారు దీనివెల 0-0-6 వలయువారలిచ్చటికే వ్రాసికొనవలె.

జిలుగుమంకెనపూల చెంగావిపైఁగప్పి
మీఱిసంపంగికటారిఁబూని
మెచ్చుగుల్కెడియవిసెపూముచ్చె లడుగు
లందుఁబొందుగఁదొడిగి సాహసమెలప
జెఱకుసింగిణిదొరయ న్వజీరుతాను
అబలపైనెత్తిచనఁగాఁ బ్రయాణమయ్యె॥ 162

వ॥ ఇట్లు దండయాత్రోత్సాహదుర్నివారుండై॥ 163

సీ॥ ముందరఁబాయక మొనచూపుశారికా
కాహళనాదముల్ గ్రమ్ముకొనఁగ
వెనువెంట బిరుదుమ్రోఁగనుపట్టు హిందోళ
భూరిభేరీధ్వనుల్ బోరుకలఁగ
కణఁగికోపులమీఱు కలకంఠమాగధ
కైరవరావముల్ గ్రందుకొనఁగ
వలనొప్పఁజుట్టును బలసియే తెంచిమేల్
పారువనంమంచ పౌజుగొలువ
గరుడపచ్చలఁగేరు చొక్కంపురెక్క
జీనుగల చిల్కతేజిపైఁబూనిచౌక
ళించిఛాత్కార నిర్ఘోషలీలస్వారి
వెడలెనామనిదళవాయి వేడ్కగాదె॥ 164

వ॥ అయ్యవసరంబున॥

సీ॥ నాతికి వరచూతపోతాగ్రకిసలయ
బృందంబు కాలాగ్నిచందమయ్యె
మృగనేత్రికిఁ బటీరనగ సమాగతగంధ
వాహంబుగరళసమూహమయ్యె
పొలఁతికి సంపూర్ణపూర్ణిమాచంద్రుని
వెన్నెలల్ నిప్పులదిన్నెలయ్యె

చిలుకలకొలికికిఁ గలికిరాచిల్కల
పలుకులు బెడిదంపుములుకులయ్యె
కామినికి మత్తకలకంఠకంఠనినద
జాతమేపఁడ నిర్ఘాతపాతమయ్యె
చందనామోద కిబ్భంగిసౌఖ్యకరము
అహహా! దుఃఖకరంబులై యతిశయిల్లె॥ 165

తే॥ ఏణలోచనకనువిచ్చి యొచటఁగనినఁ
బాణితలమునఁ బచ్చపతాణికాతు
కలువనేజాధరించి హుంకారమెసఁగ
నవుడువడిఁగుమ్మి చిమ్మినయట్లఁదోఁచు॥ 166

చ॥ పిలువదుకూర్మినెచ్చెలులఁ బేరిడి, పెంపుకుముద్దుచిల్కలన్
దలఁపదు, పెక్కురీతులను దన్నుమనోహరలీలఁజీరఁగా
నిలువదు పూవుపాన్పుపయి, నెమ్మదిసారెకు నుల్కిపాటుతోఁ
గలువలనేలుపోయగపుఁగన్నులకల్కి వియోగవేదనన్॥ 167

క॥ ఆడదుచెలియలతోఁ గడు!వీడదు లోఁజింతపంతమే సరిపడుచున్
బాడదుముద్దులపాటలు!చూడదు ముకురమునఁదనదు సుందరలీలన్॥

తే॥ వలసివల్లమిసఖులతోఁ బలుకఁబాడ
కలయుగీర్వాణ భాషలోఁ దెలుఁగుభాష
సరసరాగంబునందు లాహిరిచెలంగు
నొకటిచేయంగఁబోవ వేఱొకటిదోఁచు॥ 169

వ॥ మఱియును॥ 170

సీ॥ రాకానిశాకర ప్రతిమానవదనకా
హారము లీలావిహారముడిగె
వికసితశతపత్ర విమలాయతేక్షణ
కాటలుసరసంపు మాటలుడిగె

స్వర్ణగాత్రికిఁ బ్రాణసఖులతో మేలంపుఁ
జేతలుగందంపుఁ బూఁతలుడిగె
నారీమణికిఁ గీరశారికాదులమీఁద
రక్తియునైపథ్యయుక్తియుడిగె
ఉడిగెనన్నియు నామృదులోరుయుగళి
కంతకంతకు సంతాపమతిశయిల్లె
కలికికన్నుల బాష్పముల్ గ్రమ్మదొణఁగె
మదనుఁ డుద్వృత్తిమైసారె మదిగలంప॥ 171

వ॥ ఇత్తెఱంగున దురంతంబగు విరహసంతాపంబునంగంది కుందిన యయ్యింతిం గనుంగొని సారంగకుంతలలు లత్యంతచింతాక్రాంత స్వాంతలై మెల్లమెల్లనడాయనేతెంచి తమలో నిట్లనిరి॥ 172

తే॥ "ఏటికిఁ బ్రదీపుకడకేగె నిందువదన
యేగినంత నెసుతువార్తఁ దేల చెప్పె
చెప్పినంత నెమోహంబుఁ జెందనేల
మోహ మొందినయంత నె సాహసమున॥ 173

తే॥ ఇఱుకులో సోఁకు మంత్రముకరణిమరుఁడు
చెలియనురువడి నిట్టట్టుచేయ నేల
వెలయుఁదలపోసి చూచిన విషమసంధి
కీడుతలఁచుట నీచులజాడగాదె॥ 174

ఉ॥ కోమలిగుత్తపుఁ గులుకుకోడెచనుంగవ పైపయింగుగా
భామినులార! పొందుపడఁబయ్యెదగప్పుఁడి, చక్రదంపతి
శ్రీమహితస్థితిఁ జెంగిశీతమయూఖుఁడుదీప్తిపూర్ణుడై
కౌముదిపేరిటందనరు గాఢపుమంటలుగుప్పఁ బైఁబయిన్॥ 175
ఉ॥ ఏగతిఁదాళునమ్మ తరళేక్షణలార! పసిండిబొమ్మయౌ
నాగసమానయాన మదనస్ఫుటసాయక వహ్నికీలలన్

గ్రాఁగికరంగఁజొచ్చి వడిఘూర్ణకబంధ మిపంబు చేసరో!
బాగుగ దీనికిందగు నుపాయమికెట్లొకొ యాచరింపఁగాన్ ॥ 176

తే॥ ఇఱుకుగుబ్బలనడుమ మేల్బెఱుకువింటి
కఱకుపూటమ్ము లెక్కుడి కంతుఁడలిగి
చిత్తజల్లుగఁ గురియ నేఁజెల్ల చిన్ని
బాలయోగతిఁ దాళంగఁజాలునమ్మ॥ 177

ఉ॥ పంకజగంధిపాదములు పల్లవముల్ సుమగుచ్ఛముల్ కురం
గాంక నిభాస్యచన్నులు సితాంబుజ పత్రవిశాలనేత్రి మే
ల్పొంకపు బాహులాలతలు పొల్పఱునీసుమగంధియయ్యరో!
యింకెటులోర్చుదాపశిఖి కేపడి యీవిరహాగ్ని హెచ్చఁగన్"॥

క॥ అని బహుభంగులఁగాంతా
మణులెంతయుఁ జింతవంతమదిఁగుందఁగ నే
పున నం దొక ప్రౌఢాంగన
వనజాననకిట్టులనియె వాక్యప్రౌఢిన్॥ 179

తే॥ "సారసంపూర్ణ పూర్ణిమాచంద్రవదన!
చెలిమికత్తెలు నీకయిచింత నొంద
నించుకేనియుఁ బలుక వీవిట్టులున్న
దనుచుఁదెలుపవు నీ కిదిన్యాయమానె॥ 180

చ॥ కలకలనవ్వునంతనలుకన్ జలుకన్ జులుకంగఁజూడకో
నలినసమానచారువదనా! యదనామదనాభుఁజేర్పఁగాఁ
దలఁచినమస్తకాగ్ర్యముదితా! ముదితా మదిఁదాపమొందఁగా
వలదిఁకనిట్టులుండ ఁదగవామగువా! నగువారిఁగాన వే॥ 181

క॥ అక్కరో! వేగమెతియ్యని!
చక్కరతినుపించుమంచు ఁజనుపున ఁగదియన్
ముక్కుమొగంబును జూడక
చెక్కిలిగొట్టెదవు ముద్దుచిలుకందగునే॥ 182

క॥ మొగమెత్తి చూడవింతయు
నగవకటా! రూపలలితనవమన్మథుపైఁ
దగమనముఁ జేర్చియీగతి
తగునె వియోగాగ్నిఁ గొమ్మ! తాపముఁ బొందన్॥ 183

క॥ ఇన్నిదినంబులు నన్నున్ మన్ననగాఁ జూతువెపుడు మాటాడవయో!
కన్నియ! నాభాగ్యంబిటులున్నది నీవేమిసేయనోపుదువమ్మా॥ 184

తే॥ పిలిచిబహుమానమున మున్ను పలుకరించి
నీవుమన్ననగాఁ జూడ నెలఁతలెల్ల
రమ్మపొమ్మనిమిక్కిలి రాజసమునఁ
బెద్దగాఁ జూచెదరునన్ను ముద్దుగుమ్మ॥ 185

క॥ ఇఁక నాక్రియ లేలాగున నకలంకశశాంకవదన! యారయఁ గల్గున్
బ్రకటముగ స్వప్నమందున నకటా! తోఁచినపదార్థమగుటలుగాదే"॥

వ॥ అని యివ్విధంబున న్యాయనిష్ఠురంబులు కొన్ని పలికి య
క్కలికి కలికిపీనులు చోరమి తెలిసి మరలి బుజ్జగించి మెల్లనఁ బ్రియ
వాక్యంబుల నప్పల్లవాధరీతిలకం బిట్లనియె॥ 186

ఉ॥ "కప్పురగంధి! నీచెలిమికత్తెలు నీకుహితంబు చెప్పచోఁ
జెప్పఁగరాని ముచ్చటలు చెప్పిరొ నీదుమనోజ్ఞభావలన్
దప్పులుపట్టిరో ప్రియము తప్పమఱేమివచించిరొక్కొ మా
యప్పువుగా పరాఙ్ముఖతనందిన కారణమేమి చెప్పవే॥ 187

క॥ గుఱితప్పిమించనాడిరొ మఱుమాటలువల్కిరో సమానగరిమకే
యఱమరలు లేక నాతో సరసముగాఁ దెలుపవమ్మ చక్కెరబొమ్మా॥

ఉ॥ దాఁగిలిమూతలాడుదమొ తప్పకవీణియఁ బట్టి సొంపుగా
రాగములెత్తిపాడుదమొ రంగగుబంగరు బొంగరంబులన్
బాగుగఁ బట్టియాడుదమొ బంగరుకుందపుదారసంజ్ఞతన్
నాగవిలాసయాన! యిది నాకుఁ బ్రియంబని తెల్పి చెప్పవే॥ 189

ఉ॥ పీడియమిత్తునో కథలుపీనులవిందుగ విన్నవింతునో
వేడుక మేను పట్టుదునువింతసుగంధపుంబూంత పూంతునో
సీడలుగానరా నెదుట నిద్దపుటద్దముపట్టినిల్తునో
యాడిగమెద్ది సేతుం బ్రియ మొప్పంగం దెల్పంగ దమ్మకోమలీ"॥ 190

వ॥ అని యివ్విధంబున నవ్విధుబింబవదన పలికిన మధురాధరియగున
వ్విధువదనాతిలకం బిట్లనియె॥ 191

తే॥ "అంగనామణి! యిట్లుపొల్పంగనీకుం
దగునెమితిలేని విరహానంతాపవహ్ని
నుడుకంగానయ్యయో! పిడుగడంచినట్టి
దానింగొంఱవులంగాల్చు విధంబుదోంప"॥ 192

వ॥ అని పలికి యెప్పటియట్ల యూరకుండిన నయ్యండజయానం
గాంచి కించిస్మధ్యలికాంత శంతను భూకాంతునిపై స్వాంతంబుం జే
ర్చిదురంతంబగు విరహాసంతాపంబున నలంతంబొందుచున్నది గావున
చింతాభరంబుడుగం జేయ నివ్వనాంతరంబునం జరియింతమని యత్యంత
వసంత సౌభాగ్యసంపద్విలసితంబై యొప్పారు నవ్వనంబునకు జవ్వ
నిందోడ్కొనిచని యందొక్క యిందీవరసుందరాలక మెల్లన హల్లక
పాణితో నిట్లనియె॥ 193

* గంగయుం జెలికత్తెలు విరహతాపంబుడుప వనంబున విహరించుట. *

సీ॥ సందీప్తకాంచనచ్ఛాయాచ్ఛటలతోడ
రమణీయకలకంఠరవముతోడ
ఘనతరవారణహాన నమధ్యముతోడ
నవఘనసార గంధములతోడ
కమనీయతిలకరేఖా విశేషముతోడ
సలలితపృథుల కుచములతోడ
బంధురసిత లసద్భ్రమరకంబులతోడ
విమలశృంగార పత్రములతోడ

నంబరావరణోరు లీలా స్థితోడ
సరసనిర్మల దంతసుందరతతోడ
తనరెజవ్వనిఁబోలి యవ్వనముకంటె
చంద్రమండలసంకాశ చారువదన!॥ 194

వ॥ మఱియును.

సీ॥ ఘనశీతకర శీతకరశిలావాలభా
సురసాలసురసాల సుందరంబు
తతమహాత్పల మహాత్పల భూరిరాజీవ
రాజీవిరాజిత రమ్యసరసి
కేసర కేసర కేసర స్ఫురితంబు
తరుణకదంబ కదంబకంబు
మందారమందార కుందామ్లకలితంబు
కాంచన కాంచనాభ్యంచితంబు
దంతశరదంతశరసు కాంతస్థలంబు
రమ్యకలకంఠ కలకంఠ రావయుతము
నగుచు నారామమెంతయు నలరెఁగంటె
అబ్జవరపత్రజైత్ర కణాంత నేత్ర! ॥ 195

తే॥ కాంచనస్యందన స్థితిగాంచిమావు
లెలమినొప్పారి పున్నాగములు చెలంగి
చిత్రకరపీరతరులు ప్రసిద్ధిమెఱసి
పట్టణముఁబోలె నవ్వనిపద్మగంధి ॥ 196

మఱియును, 197

సీ॥ పన్నిటివాఁకలు బలుమావిమోకలు
చిత్తరుబొమ్మ లీక్షింపవమ్మ
కపురంపుదీవులు కన్నె మేలోఁకువులు
సూటిముద్దులగుమ్మ చూడవమ్మ

కెందమ్మిబావులు కందర్పుమావులు
ఘనలీలనోయమ్మ కనఁగదమ్మ
కాసినపూగముల్ పూసిననాగముల్
మించి చక్కనికొమ్మ కాంచితమ్మ
కొండగోఁగులు గోఁగులుగొప్పవైన
గంగరావులు రావులుగదిసియున్న
బొండుమల్లెలు మల్లెలు పూవుబోణి
దాడినిమ్మలు నిమ్మలు చూడవమ్మ॥ 198

చ॥ సరవిశిఖండచిత్రకర చంద్రకళాభరణప్రశస్తిచేఁ
గరముఁదలిర్చి రాజితనగస్థితిభాసురకాళికాప్రమో
దరసనిగుంభనప్రచురతాండవలీల నెసంగెనిచ్చటన్
స్థిరమతినీలకంఠ వితతిన్ గనుగొంటె మరాళగామినీ! 199

క॥ లలినేత్రరాగలీలా। కలితంబై మధువిలోలగతిపంచమసం
కులరవముసఁదగె నీవిటగలకంఠివితతిచూడఁగ దెకలకంఠి! ॥ 100

మ॥ కలితక్రోధరసంబు ముక్కులనెసంగన్ బక్షపాతంబులన్
ఫలభంగంబును జేయుచున్న దిదలిపఙ్క్తిం గొమ్మలంజెంది యీ
చిలుకల్ మాధవసేవనానుకలితాత్మీయప్రభావాప్తినో
కలికీ! చూడుము కాఖ్యగాంచె, భగవత్కైంకర్యముల్ వ్యర్థమే॥

వ॥ అని పలికి పరిహాసంబుగా మఱియు నిట్లనియె॥ 102

సీ॥ "ఓకొమ్మ! వీక్షింపుమాకొమ్మ పల్లవ
రాగజృంభణగతిరహివహించె
ఓరామ! చూచితే యీరామభూమి భు
జంగసంగతియయి రంగుమీఱె
ఓశ్యామ! కనుగొంటె యీశ్యామబహువిట
పారూఢమై ఖరి నతిశయిల్లె

తే॥ దక్షిణేతరగుల్ఫంబు ద(క్షిణోరు)
తలముగ డియుంచి నిశ్చలత్వంబుదాల్చి
(మేను సమముగ నిడి సుఖాసీనుఁ)డగుచుఁ
దనర వీరాసనంబం(డ్రు త త్త్వవిదులు॥ 157
శా॥ అండాధస్స్థలిఁ బాయుపార్శ్వముల సవ్యాసవ్యగుల్ఫద్వయం
బొండొంటిం గ్రమహీనభంగినిడి(జా)నోప్వారుహస్తాంగుళుల్
దండిన్ జానువులం బ్రసారములుగాఁ దాఁగొల్వ సింహాసనం
బొండేమింగనఁబోక నాసికము(పై)నోజన్ విలోకింపఁగన్॥ 158
తే॥ అండములక్రింద శేఫ(స్సుదండిరెండు)
పార్శ్వముల డాయ నుభయగుల్ఫములువెట్టి
పార్ష్ణిపదములఁ గరములఁబట్టి నిశ్చ
లాత్ముఁడై యుండెనేని భద్రాసనంబు॥ 159

వ॥ ఇది సర్వరోగవిషాపద్రవంబులహరించు, మఱియు, సీవనీద క్షిణవామదేశంబుల వామదక్షిణగుల్ఫంబులం జేర్చి పీడించి యవక్రగ తింగూర్చున్న ముక్తాసనంబనంబడు, మతాంతరంబున మేఢ్రోపరిస్థానం బున సవ్యగుల్ఫంబుకు దానిమీఁద దక్షిణ(గుల్ఫం)బునున్ నిలుపముక్తా సనంబగు నెంతయు, 160

మ॥ ధరణిన్ హస్తతలంబులుంచి తనువుం దండాకృతింజేసి కూ
ర్పరయుగ్మంబులు నాభిపార్శ్వములఁ జేరంగూర్చి యేకాగ్రభా
స్వరచిత్తుండయి యున్న తాననశిరఃపాదస్థితిన్ నిల్వఁగా
నురురోగాసువినాశనం బదియు మాయూరాసనం బెంతయున్॥

సీ॥ ఏలీలనున్నఁదా నెసఁగుమనస్థైర్య
మతిసుఖాస్పదమగునది సుఖాస
నంబనాయు క్తమౌ నదియశక్తునకొప్పు
నాసనవిజయంబెయగును లోక
జయ మట్టిదౌటఁ దా సకలంబు నాసన

జయమునసిద్ధించు నయవిధిజ్ఞ!
ఈవిధానంబున నేమర కెంతయు
నాసన స్థైర్యంబు నలవరించి
ప్రాణసంరోధ మొనరింపు పరమనియతి
అదియు రేచకపూరకాభ్యాసకలిత
కుంభకస్థితిఁజిత్తంబుఁ గుదురుపఱచు
దాన విజ్ఞానసిద్ధియౌ మానితాత్మ!॥ 162

* ప్రాణాయామవిధి *

తే॥ అరయ వర్ణత్రయాత్మకంబగుచు(నొకట)
గూ(డి) రేచకపూరకకుంభకంబు
లేకమైయుంట ప్రణవమైయెసఁగునదియ
ప్రాణసంరోధమనియండ్రు పరమమునులు॥ 163

తే॥ కడఁగి యిడచేత వాయు వాకర్షణంబు
చేసి షోడశమాత్రలచేతఁ బూర
కంబుఁజేయుచుఁ దా నకారంబుదలఁచి
యటునదియు నాల్గుమాత్రల నధికనియతి॥ 164

కం॥ కుంభక మొనరింపుచుని
ర్దంభత(ను ను)కారమూర్తి దలఁచుచుమదిలో
గంభీరమైనప్రణవము
జృంభితమతిజపము చేసి స్థిరమతియగుచున్॥ 165

తే॥ ఎంత కాలముశక్యమౌ నంత దాఁక
జపయుతుండయి వాయువుల్ నిపుణవృత్తి
నిలిపి యల మకారముమదిఁదలఁచి రేచ
కంబు పింగళఁ ద్వాత్రింశకంబుఁజేయ॥ 166

వ॥ ఇది ప్రాణాయామంబనంబడు, ఇదియ భ్యాసంబు సేయవలయు,॥ 167

మ॥ మరలంబిగళ(నుండి పూరణముదా)మాత్రాష్టయుగ్మంబుచే
సరవింగూర్చి మకారమూర్తి మదిలోఁజర్చించి దింతించి(దు
ష్కరమౌ ధారణచేయఁగావలయు నోసన్మానిసంఘా(గ్ర!)త
త్పర మోంకారజపంబు వింశతియుగన్యావృత్తిఁ జేయందగున్॥ 168

తే॥ అంతమీఁద నకారాత్మ నాత్మనిలిపి
యిడను రేచింపవలెహాయి వెలమి నిట్లు
మరల నిడచేతఁబూరించి మహిత పింగ
ళాఖ్యనాడిక రేచించు నాత్మవిదుఁడు॥ 169

సీ॥ ఈవిధంబున యోగి యెసఁగఁ బ్రాణాయామ
మభ్యసించు (త,కల దన్యస్మృతియు)
ఉదరస్థ (మా) ప్రాణ మొ(గిని)నాకర్షించి
పూరించి ప్రణవవిస్ఫురితమగుచు
వ్యాహృతిసహితమ్ము వర్తించుగాయత్రి
జపియించి మానసచలనముడుపఁ
బ్రాణనిరోధ(మా)పరమగృహస్థుండు
సంధ్యాత్రయంబునఁ జారునియతిఁ
జెలఁగిమూఁడేసిమా (రులు) చేయవలయు
బ్రహ్మచారివనావాసపరులకిది వి
కల్పముగఁజేయవలెనంచ్రు మునులు, నృపతు
లకును వైశ్యులకును విప్రులవిధమగును॥ 170

వ॥ స్త్రీశూద్రులు నమోంతంబులగు శైవవైష్ణవమంత్రంబులఁ బ్రాణాయామంబొనర్పవలయు,ఇవ్విధంబున నిత్యంబుఁ బ్రాణాయామషోడశంబొనర్చిన బ్రహ్మహత్యాదిదోషంబులుదొలంగు, షణ్మాసాభ్యాసంబున సాధకేచ్ఛాసిద్ధియగు, వత్సరాభ్యాసంబున బ్రహ్మవిదుండగు అట్లాట నిరంతరరాభ్యాసంబుచేయవలయు, స్వధర్మనిరతుండయి యోగాభ్యాసపరుండు ప్రాణసంయమనంబున ముక్తుండగు, బాహ్యం

బువలన మారుతం బుదరంబునందుఁబూరించుట పూరకంబయ్యె, సంపూర్ణకుంభంబురీతి నుదరంబున వాయువుధరించుట కుంభకం బయ్యె, ఉదరంబువలన వాయువు బాహ్యంబునకు రేచించుట రేచకంబయ్యె, స్వేదకంపనోత్థా (నం) బులు క్రమంబుగా నధ మమధ్యమోత్తమంబులు, ఇం దుత్తమంబు సంచరించుదాఁకఁ బూ ర్వం బవలంబింపవలయు, ఉత్తమంబగు ప్రాణాయామంబు సంభవించిన ప్రాజ్ఞుండు సుఖియగు, ప్రాణాయామంబునఁజిత్తశుద్ధియగు, చిత్తశుద్ధివలన (మనంబు) ప్రత్యగ్జ్యోతి (యందవస్థితంబగు)అట్లైన చిత్తం బాత్మయందు లయంబునొందు, ప్రాణాయామపరుండగు మహాత్మునకు దేహంబు జ్యోతిర్మయంబగు, కించిదుత్థానంబుగాంచు జ్ఞానంబు ముక్తిసాధనంబగు, రేచకపూరకంబులువదలి కేవలకుంభకం బభ్యసించిన సర్వపాపవినిర్ముక్తుండై సమ్యక్జ్ఞానంబునొందిమనోజయం బుగాంచు, పలితంబు నశించు, ప్రాణాయామపరుల కొకింతయు దుర్ల భంబులేదు, అట్లుకావున సర్వప్రయత్నంబులఁ బ్రాణాయామం బభ్య సింపవలయు, ఇంక వినియోగప్రకారం బెఱింగించెద, సంధ్యలయందైన మధ్యాహ్న(బ్రా)హ్మకాల (ములయ) ందైన బాహ్యప్రాణం బాకర్షించి యుదరంబునఁబూరించి నాసాగ్రనాభిమధ్యపాదాంగుష్ఠంబుల ధారణం బుచేసిన సర్వరోగరహితుండై శతవర్షజీవియగు, నాసాగ్రధారణంబున వాయుజయంబగు, నాభిమధ్యధారణంబున సర్వరోగహరంబగు, పాదాం గుష్ఠధారణంబున శరీరలఘుత్వంబుగల్గు, జిహ్వచే వాయువాకర్షించి జిహ్వామూలంబున నిరోధంబుచేసిన నమృతపానంబుచేసినసుఖంబును సకలవ్యాధినాశనంబునుం గలుగు,ఇడచేత వాయువాకర్షించి భ్రూమ ధ్యంబుననిలుప నమృతపాననిరోగతలుగలుగు,ఇడాపింగళల వాయువా కర్షించి నాభియందునిరోధించిన సర్వవ్యాధినాశనంబగు, మాసమా త్రంబు మారుతంబు జిహ్వయందారోపించి పానంబు సేయుచు నాభి యందు మందమందంబుగా నిరోధించిన వాతపిత్తజిహ్వాదోషంబు

లడంగు, నాడీద్వయంబున వాయువాకర్షించి నేత్రద్వయంబున నిరోధింప నేత్రరోగంబులడంగు, అట్లు శిరంబుననిరోధింప శిరోరోగంబులడంగు, మఱియు సమాహితమనస్కుడై స్వస్తికాసనంబధిష్ఠించి మెల్లనఁ బ్రణవంబున నపానవాయు వూర్ధ్వగతంబుగాఁ జేయుచు హస్తంబులఁ గర్ణేంద్రియంబుల నిరోధింపవలయు, అందుఁ గర్ణద్వయంబు కరాంగుళంబులఁ దర్జనుల నేత్రంబులను నన్యాంగుళంబుల నాసాపుటంబుల నిరోధించినఁ బ్రాణంబు బ్రహ్మరంధ్రగతంబగు, అట్లైన శంఖమేఘనాదాదిరూపమైన నాదంబుదయించు, వాయువు శిరోమధ్యగతంబైన గిరిశృంగంబునుంబోలి మనంబచలితంబై యాత్మాభిముఖంబగు, అంత స్తంభనవిప్రుత్తినలన సంసారనిష్కృతియగు, సవ్యగుల్ఫంబున సీవనియందును దక్షిణగుల్ఫంబున గ్రంథిమధ్యంబుననుంచిడించి జానువులయందు హస్తంబులుంచి త్ర్యంబకుండగు మహాదేవుధ్యానంబుచేసి వినాయకవాగీశ్వరులస్మరించుచు లింగనాళంబువలన నగ్నిబిందుయుక్తంబగుప్రణవంబున వాయువాకర్షించి మూలాధారమధ్యంబున నిరోధించిన నిరుద్ధవాయుదీప్తంబై వహ్నికుండలిం దహించి మరల సుషుమ్న భేదించి తన్మార్గంబునసనుచు, ఇట్లు మాసత్రయంబభ్యసించినవాయుజయంబగు, అప్పటిచిహ్నంబులెట్టివనిన,

సీ॥ స్వేదంబు మొదలఁ బసిద్ధమౌ, కంపంబు
పిదప దేహోత్థాన మొదవు నిట్టు
లీమూఁడుచిహ్నంబు లేర్పడు నసలంబు
(జిత) మైనదానికిఁ జెప్పనేల
మూలరోగము వాయుఁ దూలుభగంధర
మితరరోగ్రాతమె (ల్లఁ) జెడును
ఘోరపాపంబులు క్షుద్రపాపంబులు
చెడు నంత శుద్ధమౌఁజిత్తముగుర

మంతమీఁదట(సరవి)బ్రహ్మాదిలోక
ములుదలంపఁగ, వైరాగ్యమొదవె నేని
యతివిరక్తియు సంసారమందుఁబొడమి
నపుడు విజ్ఞాన మొదవు నత్యద్భుతముగ ॥ 172

ఉ॥ జ్ఞానము పాశహారియని చాటును వేదము లెందు, మూఢు లా
జ్ఞానసుధానిధిన్ విడిచి సారము లేని దురంతసంసృతిన్
మానరు, చిత్రవీణాసరణి, మానక యేనరుఁడైన నుల్లస
జ్జ్ఞానసుధారుచింగని యసన్మతిఁ దానిఁ దొలంగ నేర్చునే ॥ 173

తే॥ (జగముజ్ఞాన) స్వరూపంబు(సన్మునీంద్ర!
అది)యెఱుంగక(యజ్ఞులైనట్టి) జనులు
జగములర్థస్వరూపంబులుగ వచింతు
రకట! మాయాప్రభావ మేమనఁగవచ్చు ॥ 174

కం॥ క్రతువుల దేవత్వంబగు
నతితపమున బ్రహ్మలోకమబ్బును. దాన
వ్రతముల భోగములుగలుగు
వితతజ్ఞానంబువలన వెస ముక్తియగున్ ॥ 175

ఉ॥ కొందఱు ముక్తి కర్మమునఁగోరుదు, రాజడు లాత్మకర్మవ
హ్నిందహియింపఁగాఁబడుదురెంతయు నంచు వచించు వేదముల్
పొందుగ బ్రహ్మమీభువనపుంజమటంచు వచించుఁదజ్ఞుఁ, డీ
చందమెఱుంగ కజ్ఞుఁ డిల శంకరుఁగానఁడు కర్మబద్ధుఁడై ॥ 176

కం॥ అజ్ఞానపాశసంగతి
నజ్ఞం(డొ)పురుషుఁడెందు న(విముక్తుండొ)
విజ్ఞానయుక్తిచేతను
నజ్ఞాన(ము)తమ(ము)దీప్తినటులొగిని జెడున్ ॥ 177

సీ॥ స్వాత్మస్వరూపవిజ్ఞానంబుగల్గిన
నజ్ఞానమెంతయు నణఁగిపోవు

అట్టివిద్విజ్ఞాన మలవడియుంటకు
రాగాదివృత్తివిరక్తివలయు
రాగాదివృత్తివిరక్తిగల్గినమీఁదఁ
బుణ్యపాపంబులు పొలియువేగ
పుణ్యపాపంబులుఁ బొలిసినమీఁదట
దేహబంధక్షితి దీఱిపోవు
దేహసంబంధమెడల నిర్దేహియైన
యాత్మకును సుఖదుఃఖంబులనఁగ లేవు
క్లేశముక్తియె ముక్తియౌఁ గేవలముగ
అరయ నజ్ఞానమే దుఃఖ మఖిలమునకు॥ 178

తే॥ జ్ఞానమునఁగాక పోవ దజ్ఞానమొందు
కర్మ మొందున సంసారకారణంబు
జ్ఞానమునకంటెఁ బాపనాశంబు లేదు
జ్ఞాన మతిపవిత్రంబగు జగతియందు॥ 179

శా॥ జ్ఞానాభ్యాసముకంటె లేదుధర నజ్ఞానాపహారంబు త
జ్జ్ఞానాభ్యాసమునీకు స్నేహమునసే సర్వంబునుంజెప్పితిన్
మానిశాగ్రణి! గోపనీయమిది, సన్మాన్యంబు,(నీజ్ఞాన)మిం
పూనన్ నీమదినిల్పి భక్తిగరిమన్ మోక్షంబుసాధింపుమీ॥ 180

* ప్రత్యాహారవిధి *

క॥ ప్రత్యాహారముదెల్పెద
నిత్యంబును విషయతతుల నిలుచుచుఁ దత్త
త్కృత్యములుసేయు నింద్రియ
వృత్త్యారంభ (మామరలు) పువిధ మొకటియగున్ ॥ 181

క॥ ఏదేదిచూచుఁదా (నది)।సాదరమునబ్రహ్మమనుచు సన్మతిదఁలఁపన్
మేదినిఁబ్రత్యాహారం।బౌఁదెలియఁగనిదియు(మునిసాలాగ్రణి! దీనిన్॥)

తే॥ సంతతాభ్యాసమొనరించు సజ్జనులకుఁ
బాపములువాయు దుర్భవబంధమడఁగు
ఇంకనొకరీతి (గణదీని) నెఱుకపఱతు
దేవతాచార్య! వినుముసందేహమెడలి॥ 183

వ॥ (బుద్ధిని విషయంబులనుండిమరలించినిర్వికల్పంబునునిర్ద్వంద్వంబును నగు నాత్మయందు నిరోధించుటకూడఁ బ్రత్యాహారంబనందగునని వేదాంతవేత్తలచే సమాఖ్యాతంబై యున్నయది) 194

తే॥ ఇదియుసంక్షేపపద్ధతినెసఁగ జెప్పి
నాఁడ, నీరీతినభ్యసనంబుచేయు
వాని కెయ్యదిదుర్లభవస్తువిలను?
పాపపుణ్యంబులాతనిఁ బట్టుకొనవు॥ 185

వ॥ ఇట్లు ప్రత్యాహారవిధం బెఱింగి యభ్యాసంబుచేయుపురుషుండు దేవేశ్వరుండగు"నని పశుపతి వాచస్పతికిట్లనియె "నింకఁ బాదాది జాన్వం

## ధారణావిధి

తంబును జాన్వాది నాభ్యంతంబును నాభ్యాది హృదయాంతంబును హృదయాది భ్రూమధ్యాంతంబును భ్రూమధ్యాది శిరోంతంబును భూమ్యాపోనలానిలాకాశంబులఁ గ్రమంబుగా ధారణంబుచేసి యందు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివుల ధారణసేయు టొక్కధారణయంద్రు, మఱియు మనంబునఁ జంద్రుని శ్రోత్రంబుల దిశలను (బాదం) బున విష్ణుని గరంబుల నింద్రుని వాక్యంబులం దగ్ని (నపానంబు)న మిత్రుని నుపస్థయందుఁ బ్రజాపతిని ద్వక్కున వాయువును నేత్రంబుల సూర్యుని జిహ్వను వరుణుని ఘ్రాణంబున భూమిని బురుషునియందు సర్వకర్తయు బోధానందమయుండు నగు శివుని ధారణచేసిన సర్వపాపనిరోధినియగు (నిది) ధారణ (యసి) యోగశాస్త్రవిదులచేతఁ జెప్పంబడు, మఱియును.

తే॥ మనసుచే నింద్రియంబుల మట్టుపఱచి
కొంతసే పాత్మపదమునఁ గూర్చుటిదియు

రెండవపర్యాయము చెప్పిన నియమమును సర్వత్రతప్పకయుండును గనుక ప్రాణాదుల కాదిత్యాదిశబ్దములు పరోక్షనామములైన యెడలఁ బ్రాణాదిశబ్దములచేతఁ బైనిజెప్పఁబడిన ద్వివిధవ్యవహారములు లేకపోవలసివచ్చును రెండవనియమము చెప్పుటచేత నెక్కడేని యొకస్థలమందేవరిచేనేని ప్రాణమున కాదిత్యశబ్దము పరోక్షనామమని వ్రాయఁబడినను నది యంగీకరింపఁదగినది కాదు అట్లు వ్రాయువారి మతములోఁ బ్రాణశబ్దార్థము ద్వారపాలకులలో నంతఃపాతియగు వాయువిశేషము కాదు.తద్భిన్నమని వ్రాయఁబడియున్నది.కనుక నట్టివారిమతమంగీకరించినను బ్రకృతము నీకేమియు నుపకారిగాదు తదనంతరము

"బృహదారణ్యకము గ్రహాతిగ్రహనిరూపణమునం దపాన మతిగ్రహముగాఁ జెప్పఁబడుటనుండియు "నతిగ్రహమగు నపానముచే వాగింద్రియములు నామములఁజెప్పుచున్న"వని శ్రీభాష్యకారులచే నపాన మతిగ్రహముగా వ్యాఖ్యాతమై యుండుటంబట్టియు వాగ్రూపసరస్వతికిని నపానమునకును సంబంధము కనబడుచుండుటవలనను "నపానం ప్రత్యగస్యతి"యను కాఠకశ్రుతిద్వారమున నధఃప్రసరణరూప స్త్రీత్వసామ్యముండుటవలనను నపానమున కంబికయని నామనిర్దేశము చేయనయ్యె, అంబిక మహేశ్వరపత్నియు నర్ధాంగియు నగుట దంపతుల నిరువుర నొకచోటనే నిలుపుట న్యాయ్యము. ఇట్లుచేయక యాదిత్యానంతరమే యంబికం బ్రతిష్ఠించుచుండుటవలనను దదాదిత్యుఁడు ప్రాణస్వరూపుఁడగుటవలనను బ్రాణాపానములకుండు సంబంధము ప్రసిద్ధమగుటవలనను బ్రాణానంతర మపానముయొక్క పాఠక్రమముండుటవలనను నీయుభయములు పీతవర్ణములగుటవలనను బ్రత్యక్షనామముచే ఛాందోగ్యమునఁ జెప్పఁబడిన ద్వితీయస్థానమందలి యపానమునకే పంచాయతనపూజయందుఁ బరోక్షమగు నంబికానామముగ గ్రహింపనగును.

కాఠకోపనిషత్తులోని, శ్లో॥ మధ్యేవామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే యను వాక్యముయొక్క భాష్యమున "హృదయపుండరీకాకాశమం దాసీనుఁడగు పరమాత్మను జక్షురాదులగు సర్వదేవతలు రూపాదిజ్ఞానరూపమగు బలిని సమర్పించుచున్నవై సేవించుచున్న"వని భగవంతులగు భాష్యకారులచేఁ బ్రతిపాదింపఁబడియుండుటంజేసి వ్యానము పంచప్రాణములలో మధ్యవర్తియగుటవలనను నుభయములకు వ్యాపకత్వసామ్య

ముండుటవలను బలమందలియుభయసామ్యమువలనను నుభయములు నీలవర్ణములగుటవలనను బంచపూజాప్రకరణమందు మధ్యమస్థానస్థాప్యమానుఁడగు విష్ణువునామమే వ్యానమునకు విధింపఁబడినది.

"అథైకయోరూర్ధ్వఉదానః, పుణ్యేనపుణ్యంలోకంనయతి, పాపేనపాపముభాభ్యామేవమనుష్యలోకం" అను శ్రుతివలన నుదానమునకు సర్వజీవాధిపత్యముసిద్ధమగుటవలనను నుభయులయందు వరుణసామ్యమువలనను నా వ్యానమునకే చతుర్థస్థానస్థ గణపత్యభిధానము యుక్తమైయున్నది.

సమానమున కధ్యాత్మికాధిదైవతములయం దంతట సమానస్థితికనఁబడుచుండుటవలనను సమానశబ్దస్వారస్యమువలనను నుభయులును గలుపుపసుపుకలిసినవర్ణము గలవారగుటవలనను మహేశ్వరనామధేయ మర్హమైయున్నది.

ఈప్రకారము ప్రాణాదిపంచదేవతలకే రామాదిత్యాదిపరోక్షనామము తేర్పఱుపఁబడినవని యాత్మవేత్తలు సంతసింతురుగాక,

అని లిఖింపఁబడినది- ఇది యంతయుఁ బూర్వోక్తపరోక్షనామసంప్రదాయప్రదర్శనమునకే దత్తోత్తర మగుచున్నయది- "సతికుడ్యేచిత్రకర్మ" యనున్యాయమునఁ బ్రాణాగులకాదిత్యాదికములగు పరోక్షనామములుండియున్నచోఁ ద్వదుక్తమాతయు సముజసమై యుయ్యెడిది గాని యదియే యసంభవమని యింతకుముస్నే వచించితిని. ఐనను యథార్థజిజ్ఞాసులకు సంప్రదాయము దెలియుటకొఱకును నేతద్గ్రంథవాక్యము లశాస్త్రీయములని చూపుటకును గొంచెమిచట వివేచనసేయఁబడుచున్నది-ఆదిత్యమంబికాంవిష్ణుం గణనాథంమహేశ్వరం మనుశ్లోకము పంచాయతనపూజయందుఁ బూజనీయదేవతావిన్యాసక్రమ మొన్నటికిఁ గాదు-పంచాయతనవిన్యాసక్రమబోధకస్మృతులయం దీయులఁగస్పట్టదు-తత్సంప్రదాయక్రమబోధకమగుస్మృతినొకండుదాహరింతుము.

శ్లో॥ శంభౌ మధ్యగతే హరీనహరభూదేవ్యో, హరౌ శంకరే
భాస్యేనాగసుతా, రవౌ హరగణేశాంబికా స్థాపితాః
దేవ్యాం విష్ణుహరేభవక్త్రిరవయో, లంబోదరే జేశ్వరే
నాంబాశ్శంకరభాగతోతిసుఖదాఁవ్యస్తాస్తు హానిప్రదాః

స్వాభిమతదేవతను మధ్యసంస్థాపించి యితరదేవతల నీశాన్యాదిక్రమమునఁ బరివారముగాఁ బూజింపవలె- ఈశ్వరపంచాయతనమున నీశ్వరుని మధ్యనుంచి విష్ణ్వాదిత్యవిఘ్నేశాంబికలను క్రమముగా నీశాన్యాగ్నేయనైరృతవాయవ్యకోణములయం దుంచవలెను- అట్లేవిష్ణుపంచాయతనమున శంకరవిఘ్నేశసూర్యాంబికలను సూర్యపంచాయతనమున హరివిఘ్నేశవిష్ణ్వంబికలను దేవీపంచాయతనమున విష్ణుహరివిఘ్నేశసూర్యులను విఘ్నేశపంచాయతనమున విష్ణ్వీశసూర్యాంబికలను క్రమముగాఁ బూర్వోక్తరీతి నీశాన్యాదికోణములయం దుంచవలెను- ఇంక బ్రహ్మోపాసనయందో ప్రాణవ్యానాపానసమానోదానములం క్రమముగాఁ బూర్వదక్షిణపశ్చిమోత్తరోర్ధ్వదిక్కులయం దుంచవలెను. కావున నిరెం డుపాసనలకును వైషమ్యముగలదు. ప్రాణాదుల కెట్లాదిత్యాదికములు పరోక్షనామములని చెప్పితివో యట్లు ప్రాచ్యాదులకును సంగతవాక్యము లుదాహరించి యీశాన్యాదికములు పరోక్షనామములని చెప్పెదవా యేమి? అది నీకేశోభింపవలె- ఇఁకనాదిత్యమంబికాంవిష్ణుం గణనాథంమహేశ్వరమనుశ్లోకమే నామములనువలె విన్యాసక్రమమును బోధించుచున్నదనియందువేని యేకపక్షసాధకయుక్త్యభావమున రవిర్వినాయకశ్చండీ ఈశోవిష్ణుస్తుపంచమః మొదలగు శ్లోకములుమాత్ర మిట్టివికావా? వానియందు వేఱువేఱువిధములఁ జెప్పబడియుండెను. కావున నివియన్నియుఁ బూజనీయదేవతానామబోధకములే కానియన్యములు కావు విన్యాసక్రమబోధకశ్లోకము ముందేయుదాహరింపఁబడినది. ఇఁక ద్వితీయస్థానోక్తమగు నపానవాయువునకును బంచాయతనాంతర్గత దేవతాంతర్గత యగు నంబికకును సంబంధముఁజూపుటయందుఁబ్రసక్తమైననీగ్రంథమం దాదిత్యానంతరమం దంబికాప్రతిష్ఠకనఁబడుటచే "ద్వితీయస్థానమునఁ బ్రత్యక్షనామముచేఁజెప్పఁబడిన యపానవాయువునకుఁ బంచాయతనపూజలో నంబికయని పరోక్షనామముచిత"మని వ్రాసినవ్రాఁత యవిచారితరమణీయమైకన్పట్టెడిని-ఆదిత్యా

నంతర మంబికాప్రతిష్ఠాపనమును నెడ నాదిత్యాంబికాశబ్దముల శబ్దపరములంజేసి "యాదిత్యమను శ్లోకమున నట్లున్న" దనునర్థము చెప్పంబడెనా? లేక యర్థపరములఁజేసి "పూజయం దట్లు విన్యాస"మను నర్థముచెప్పంబడెనా? ఉపయోగకారికానందనను రవిర్వినాయకశ్చండీ మొదలగు శ్లోకములయం దన్యథాకనుపట్టుటవలనను శబ్దపరములఁజేయ వీలుకాలు గదు. అర్థపరముఁజేయుటకుఁ బంచాయతనపూజలోని మూడుక్రమములయందును నాదిత్యానంతర మంబికా నివేశనము కనఁబడదు. విచారింపఁగా స్థలద్వయమందును నాదిత్యానంతర్యముకలదుకాని యాస్థలములయం దంబికాస్థాపన చతుర్థస్థానమందే కన్పట్టెడు. ద్వారపాలకోపాసనయం "దపానమునకు ద్వితీయస్థాన"మని నీగ్రంథమే చెప్పుచున్నదికావున నీవు చెప్పినసంబంధ మసంబద్ధమైతోఁచెడిని. ఇదియొక వైషమ్యమును ద్వారపాలకోపాసనలోఁ బంచప్రాణములయందు దేనికిని ప్రాధాన్యములేక సమప్రధానభావముచేతనే యుపాసనవిహితమై యుండుటయుఁ బంచాయతనపూజయం దొకదానికిఁ బ్రాధాన్యమును దక్కినవానిగింటికి నుపసర్జనత్వము నుండుటయు రెండవవైషమ్యమును నైయున్నవి. అదియునుంగాక పంచాయతనపూజలో నొకొక్కస్థానమున విష్ణ్వాదుల నొకొక్కరినుంచియే యుపాసనము చెప్పఁబడినది ద్వారపాలకోపాసనయం దట్లుకాదు. శ్రుతిసిద్ధమైన సంబంధముగల ప్రాణచక్షురాదిత్యుల నొకొక్కస్థానమందుంచియే యుపాసింపవలసి యున్నది. ఇట్లే యుపానవాగగ్నులను ద్వితీయస్థానమందుఁ బూజింపవలె. ఈలాగే యవశిష్టస్థలములయందును శ్రుత్యుక్తప్రకారముగా మూడుమూ డొకచోటఁబెట్టి పూజింపవలెను. ఇదియే మహావైషమ్యము. ద్వారపాలకోపాసనలోఁ బ్రథమస్థలమునఁ దేజస్వాన్నాదత్వగుణములుగలదానిసగాఁ బ్రాణవాయువు నుపాసనచేయవలె- అట్లుపాసన చేయుపురుషుఁడు కూడఁ దేజశ్శాలియు నన్నభక్షకుఁడును నగు- ద్వితీయస్థానమందును బ్రహ్మవర్చస్వాన్నాదత్వగుణములుగల

దానిఁగా వ్యానము నుపాసింపవలె- ఈలాగుననే తక్కినముఖ్యస్థలము లయందును నాయాయాగుణభేదములతో నుపాసనయు నుపాసనా భేదముచే ఫలభేదమును ఛాందోగ్యమందే చెప్పఁబడియున్నది. పంచా యతనపూజయం దట్టిగుణభేదములతో నుపాసనచేయవలసినట్లు చెప్పఁ బడలేదు. అట్టిశిష్టాచారమును లేదు. అందువలనఁగూడ రెండుపాస నలకుం జాలభేదములుకలవు. కావున ద్వారపాలకోపాసనకుఁ బ్రతినిధిగాఁ బంచాయతనపూజకుఁ బ్రసక్తియేలేదు- ఇఁకనేమనఁగా ద్వారపాలకో పాసనాదికమువలెనే పంచాయతనపూజయుఁ జిత్తశుద్ధిద్వారమున స్వ తంత్రముగాఁ బరంపరాజ్ఞానసాధనమని తెలిసికోవలెను- మఱికొన్ని భేదము లీపట్ల బుద్ధిమంతు లూహించుకొందురుగాక- పైకారణముల వలన ద్వారపాలకములగు ప్రాణాదులకును నాదిత్యాదిపంచదేవతలకు ను బరస్పరసంబంధప్రదర్శనపరమగు కామశాస్త్రిగారిగ్రంథము కేవల బాహుళ్యమాత్రమే ఫలముకలదికాని సంప్రదాయాదిప్రదర్శనపరము కానేరదు- ఇదియంతయుఁ బ్రాణాదులకుఁ బ్రాగాదిద్వారసంబంధాది క మంగీకరించి ఖండనచేయఁబడినది- వాస్తవము గవిచారించినఁ "ప్రథ మస్థానమగు ప్రాగ్ద్వారమునఁ బ్రాణచక్షురాదిత్యులను ద్వితీయస్థాన మైనదక్షిణద్వారమందు వ్యానశ్రోత్రచంద్రులను దృతీయస్థానమగు ప శ్చిమద్వారమున నపానవాగగ్నులను జతుర్థస్థానమగును త్తరద్వారము న సమానమనఃపర్జన్యులను బంచమస్థానమగునూర్ధ్వద్వారమున నుదా నవాయ్వాకాశములను గలిపి యుపాసింపవలె"నని ఛాందోగ్యమందుఁ గ్రమము కనఁబడుచున్నది. ఇట్లుండఁ "ప్రథమస్థానమునఁ బ్రాణ మును ద్వితీయస్థానమం దపానమును దృతీయస్థానమందు వ్యానమును జతుర్థస్థానమం దుదానమును బంచమస్థానమందు సమానమును నుపా సింపవలె"నని శాస్త్రిగారుచెప్పుచున్నవారు. శ్రుత్యుక్తక్రమము శా స్త్రిగారియాయాసమును సివారింపదో? తానుజెప్పినక్రమము "ఛాం దోగ్యమందున్న"దని స్వగ్రంథమందువ్రాయుటే శాస్త్రిగారిప్రవృత్తి

కేవలము లోకప్రతారణార్థమని స్పష్టపడుచున్నది- కానిచో శ్రుత్యుక్తక్రమమువదలి రెండవక్రమను మేలవ్రాయును? శబ్దక్రమమాత్రలేఖనమందే శ్రుత్యుక్తమార్గమునశింపనివానికి తదుక్తార్థగ్రహణము దసహానమనునది వేఱుగ వ్రాయనక్కఱలేదు-ఇందువలన శ్రుతిమార్గ మన్నివిధములచే మూర్తిపూజావిద్వేషియగు నీగ్రంథకర్తచే బరిత్యజింపఁబడినదని స్థాలీపులాకన్యాయమున నందఱుఁ గ్రహింపనగును- తదనంతరగ్రంథము.

"ఈప్రసంగసంగతిచే మిగిలినభాగ మించుక చెప్పుచున్నాను. సర్వదేశములయందును శిష్టు లర్చారాధనముచేయుచున్నారుకదా? అది న్యాయ్యముకాదు. ఈ విషయమునఁ బరాశరీయమందు, శ్లో॥ " అప్స్వగ్నౌ హృదయే సూర్యే స్థండిలే ప్రతిమాసుచ। షట్స్వేతేషుహరేస్సమ్య గర్చనం మునిభిస్స్మృత" మనిచెప్పి యక్కడనే"అగ్నౌ క్రియావతాందేవ మొదలగువానిచేఁ దత్తద్దేవతారాధనవిషయమై యధికారపభాగము కూడఁ గనఁబఱుపఁబడియున్నది. "కర్మానుష్ఠానమం దధికృతులైనవారి కగ్నియందే దేవపూజ విహిత" మనియు "ననధికృతులగు స్వల్పబుద్ధులకుఁ బ్రతిమార్చన కర్తవ్య" మనియుఁ బైగ్రంథమున నుపదేశింపఁబడియున్నది. అట్లున్నను శ్రౌతస్మార్తకర్మానుష్ఠానాధికృతులచేఁగూడఁ దద్విధివదలి వేదహితకర్మానధికారులకుఁ గర్తవ్యమగుటచేఁ బ్రాప్తమైన యర్చారాధనచేయఁబడుట యాశ్చర్యకరముకాదు. ఎందువల్లననిన? కలికాలసంజాత కామక్రోధాదిమోహితస్వాంతులును దేహాత్మపరాయణులును నకరణమందుఁ బ్రత్యవాయజనకములగు విహితౌపాసనవైశ్వదేవాదికర్మలఁగూడ నప్రవృత్తులును నగు నిదానీంతనవిప్రులకు యథేష్టాచరణవశముననైన పరధర్మాచరణప్రసక్తియు స్వధర్మత్యాగమును సులభముగాసంభవించుచున్నయది"

అనియున్నది. ఇది యుక్తముకాదు. శిష్టులగుటవలననే యర్చారాధనముం జేయుచున్నారు. వారికే యది విధియైయున్నది. కనుకనే లలితాసహస్రనామమున "శిష్టేష్టాశిష్టపూజితా" యని చెప్పఁబడియున్నది. "అప్స్వగ్నౌ హృదయే" యను శ్లోకమునఁ జెప్పఁబడిన మూర్తిస్థలములలోఁ "గర్మిష్ఠులకగ్నియందే దేవపూజవిహితమైన" దని వ్రాయుట యనుచితము. అచ్చట నేవకారము కనఁబడదు.సర్వత్ర శ్రీశాస్త్రిగారు

వచనానుక్తార్థమే స్వతంత్రముగాఁ గనఁబఱచుచున్నవారు. ఈఫక్కి
యేగురువువద్దనభ్యసించిరో తెలియఁబడదు. "క్రియావంతుల కర్చారా
ధన కూడ" దని యెందుండెనో కానఁబడదు. ఇఁక నేమనఁగా ననేకస్మృ
త్యాదులయందు శ్రౌతస్మార్తకర్మలందుఁగూడ దేవపూజకు సాహిత్య
మేకనఁబడుచున్నది. ఇందుకుఁ బ్రమాణములు, పరాశరస్మృతి, శ్లో॥
షట్కర్మాభిరతో నిత్యం దేవతాతిథిపూజకః। హుతశేషంతుభుంజానో
బ్రాహ్మణోనావసీదతి॥ సంధ్యాస్నానం జపోహోమో దేవతానాంచ
పూజనం। ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణిదినేదినే॥ మనుస్మృతి
శ్లో॥ దేవాన్ ఋషీన్ మనుష్యాంశ్చ పితౄన్ గృహ్యాశ్చదేవతాః॥
పరాశరమాధవీయము, మరీచిః, శ్లో॥ విధాయదేవతాపూజాం ప్రాతర్హో
మాదనంతరం॥ కూర్మపురాణము, శ్లో॥ నిష్పీడ్యస్నానవస్త్రంవై సమా
చమ్యచవాగ్యతః। స్వైర్మంత్రైరర్చయేద్దేవాన్ పత్రైః పుష్పైస్తథాంబు
భిః॥ అప్స్వగ్నావిత్యాదు లధికారిభేదమనుసరించి పూజాస్థానములఁ
బ్రదర్శించుచున్నవికాని వేఱుకాదు. కనుకనే యోగవాశిష్ఠమందు,
శ్లో॥ అజ్ఞాతశివతత్త్వానాం సాకారాద్యర్చనంస్మృతం। యోజనాధ్వస్య
శక్తస్య క్రోశాధ్వాపరికల్ప్యతే॥ మొదలగువానిచేఁ దత్త్వజ్ఞానశూన్యు
లకు సాకారాద్యర్చనము చెప్పఁబడియున్నది. వైదికకర్మాధికృతత్వము
చేఁ దత్త్వజ్ఞులు కానేరరు ఇట్లు పరాశరస్మృత్యుక్తదేవపూజ వేదో
క్తకర్మమధ్యప్రతిపాదితమగుచుండ నది యర్థజరతీయన్యాయమునఁగాక
బ్రాహ్మణబ్రువుల కెట్లువర్తించెడిని.

ఔపాసనవైశ్వదేవాదిపరిత్యాగమం దెట్లుప్రత్యవాయమో దేవ
పూజాపరిత్యాగమం దట్లే ప్రత్యవాయము. కనుకనే "షట్కర్మాభి
రత"యనుశ్లోకమందలి నిత్యశబ్దమునకుఁ బూర్వవాక్యముతో నన్వయ
మును సయుక్తికముగా నిషేధించి యుత్తరవాక్యముతోడనే మాధ
వాచార్యులచేఁ బ్రదర్శింపఁబడినది. నిత్యత్వమనఁగా నకరణమందుఁ
బ్రత్యవాయజనకత్వము. ఇట్లు దేవపూజకును నిత్యత్వము సంప్రాప్త

మగుచున్నదికావునఁ దత్పరిత్యాగమందుఁ బ్రత్యవాయము బహుగ్రంథకృతిస్మృతము. చూడుఁడు, దేవలః శ్లో॥ దేవతారాధనంత్యక్త్వా వైశ్వదేవం తథాతిథిం। యోవిప్రోభోజనంకృత్వా నిత్యహోమాంతథాత్యజేత్। సురాపీసహివిజ్ఞేయ స్సర్వకర్మబహిష్కృతః॥ మార్కండేయః, శ్లో॥ వైశ్వదేవం నిత్యహోమం తథైవాతిథిభోజనం।దేవతారాధనం చైవ త్యక్త్వావిప్రోమహామునే!॥భుక్త్వాజ్ఞానాన్మహాదోషీ సురాపీకథ్యతే బుధైః॥ ఇట్లుపరాశరమాధవీయమందు "షట్కర్మాభిరతోనిత్య"మను శ్లోకపువ్యాఖ్యానమున "దేవతాతిథిపూజకుఁడు చెడిపోఁ"డనువాక్యముచేఁ "బూజచేయనిచోఁ జెడిపోవు"ననునర్థము ధ్వనించుచున్నది. అట్లు కూర్మపురాణమునఁగూడ, శ్లో॥ యోమోహాదథవాలస్యా దకృత్వాదేవతార్చనం। భుంక్తే స యాతినరకం సూకరేష్వేవజాయతే॥అకృత్వాదేవపూజాంచమహాయజ్ఞాన్ ద్విజోత్తమః।భుంజీతచేత్సమూఢాత్మా తిర్యగ్యోనించగచ్ఛతి॥ అనియున్నది. దేవపూజచేఁ గేవలమనిష్టాభావమేకాక యభ్యుదయప్రాప్తికూడఁగలదు. ఇందులకుఁ బ్రమాణము విష్ణుధర్మోత్తరము, శ్లో॥ యేర్చయంతిసదావిష్ణుం శంఖచక్రగదాధరం సర్వపాపవినిర్ముక్తా బ్రహ్మణంప్రవిశంతి తే॥కూర్మపురాణము, శ్లో॥ వేదాభ్యాసోన్వహంశక్త్యా మహాయజ్ఞక్రియాతథా।నాశయత్యాశుపాపాని దేవానామర్చనంతథా॥ ఈయుదాహృతవాక్యములయందు మోహాదికముచేఁజేయుదేవపూజాపరిత్యాగమునకే దోషముచెప్పఁబడియుండ బుద్ధిపూర్వకపరిత్యాగమున కేమిచెప్పవలెను. వేదాభ్యాసపంచమహాయజ్ఞములతోపాటు దేవపూజకుఁ బాపనాశకత ప్రతిపాదింపఁబడుటవలన వేదాభ్యాసాదితుల్యమనియే యెఱుఁగవలెను. బ్రాహ్మణబ్రువులకు వేదాభ్యాసముండఁగాని పంచమహాయజ్ఞములందుఁగాని యధికారము లేనేలేదు. కావున వైశ్వదేవాదులయందువలె దేవపూజయందును శ్రీశాస్త్రులవారికృపాదృష్టి యుంచఁబడుఁగాక. శాస్త్రులవారూ! దేవపూజ శ్రుత్యుక్తకర్మానధికారివిషయమనునది కేవల భవదీయబుద్ధి



శ్రీపరమేశ్వరాయనమః.

యతోధర్మస్తతోజయః=సత్యమేవజయతి. నానృతం.

# రజస్వలావివాహఖండనము.

క॥ ధర్మంబుఁ జెలుపఁ జెలుచు, ధర్మము రక్షించువానిఁ దారక్షించున్
ధర్మంబు చెడక యుండును, నిర్మలమతిఁ బ్రోవవలయు నిశ్చలనియతిన్॥

(భారతము)

* మన సంఘసంస్కారసోదరులు రజస్వలావివాహములనుగోరుటకుఁ గారణమేమి? *

ఈవిషయమయినవారియభిప్రాయమును మేము లోఁతుగవిచారించి మాబుద్ధులకు గోచరించినంతవఱకు సత్యమునుసాధించి సప్రమాణముగ నిందువివరించుచున్నారము. కాన వివేకనిధులగుతాము సావధానమానసముల నిందలిసత్యాసత్యములవిమర్శించి యసత్యమును బరిత్యజించిసత్యమునుగ్రహింపఁ బ్రార్థించుచుఁ బ్రకృతమునకువచ్చుచున్నారము.

ఇప్పుడు మనహిందూదేశమునంగలప్రజానాయకులలో ననేకులు పరభాషాపాండిత్యమును సంపాదించి రాజనీతికోవిదులై పరిపాలనమునఁ దమసోదరులకుఁ గొన్ని స్వాతంత్ర్యములనార్జింపఁగోరి రాజకార్యధురంధరులగు పాశ్చాత్యపండితప్రకాండులతో ముచ్చటింప రాజనీతివిశారదులగు నాపాశ్చిమాత్యపండితులు మీలో వందలకొలఁది మతభేదములుండి యవి ద్వేషజనకములై యుండుటచే రాజ్యాంగస్వాతంత్ర్యములు మీకులభించినంతనె యాకలహములను బురస్కరించుకొని యొండొరులుపోరాడి హతులగుటయె ఫలముగాఁ బరిణమించును గాన మీసంఘక్షేమమును మీరు త్రికరణశుద్ధిగాఁ గోరుదురేని దొలుతొల్త మీలో నేకజాతీయత లోనగు సంస్కరణముల నెలకొలుపుకొనుట యవసరమని యుపదేశించినటుల వినియున్నవారము. ఆయుపదేశమును బ్రహ్మోపదేశమును గాఁగొని యదిమొదలు మనసోదరులలోఁగొందఱు సంఘమును సంస్కరింపవలెననితలంచి సంస్కారులను పేరిడుకొని జాతిమతభేదనిర్మూలనమునకై కంకణముఁగట్టుకొని సంస్కరణరాజమనఁదగిన యేకజాతీయత (వర్ణసాంకర్యము) ను జే

యాఁదలఁచి యందులకు మొదటియెత్తుగా సర్వవర్ణ సమావేశపువిందులను గుడువనారంభించిరి. యీయాచారము పూర్వాచారపరాయణులకుఁ గడునసహ్యమగుటచేఁ గంటగించుకొని వారిని దూరదూరముగాఁ జూడసాగిరి.

మనసోదరు లేకజాతీయత నెలకొల్పుటకై యత్నించినవిషయము మీకు విశ్వాసపాత్రమగుటకై సంఘసంస్కార సోదరులవాక్యములనే కొన్నిటినిందు వ్రాయుచున్నారము.

చూడుఁడు కృష్ణాపత్రికసంపుటము 12 సంచిక 21 సంపాదకవ్యాసమున.

“ఎప్పుడో యీదేశమునందు హిందువులు మహమ్మదీయులు క్రైస్తవులుఆంధ్రులు అరవలు,బంగాళీలు పంజాబీలు, భారతదేశమందుఁ బుట్టినవారెల్లరును నొక్కమతమవలంబించి యొక్కభాషనుమాట్లాడి యొక్కయాచారమునుస్వీకరించి యేకజాతీయత నెలకొల్పఁబడునని కొందఱు సంస్కరణధురీణులు విశ్వసించుచున్నారు.”

అని పత్రికాధిపతులు సెలవిచ్చియున్నారు. దీనింబట్టి మే మిదివఱకువిన్నవించినట్లు కొందఱుసంస్కర్త లేకజాతీయత (వర్ణసాంకర్యము) ను స్థాపించుటకు యత్నించినట్లు తెలియవచ్చినదికదా.

ఇఁక నీ యేకజాతీయతాప్రయత్నము పాశ్చాత్యపండితప్రకాండుల బోధలవలనఁ గలిగినదని నిరూపించుట మాపనియైయున్నది. కనుగొనుఁడు. కృష్ణాపత్రికసంపు 12 సంచిక 28 “ఆంధ్రరాష్ట్రోద్యమము” అనుశీర్షికక్రింద శ్రీయుత జి. రామచంద్రరావు యం. ఏ. గారువ్రాసిన వ్యాసమునందలి ఈవాదమును (భాషనుబట్టి రాష్ట్రమును విభజించుటను) బలపఱచుటకై లండనులోని హోడర్ అండు స్టౌటన్ కంపెనీవారిచే 1908 సంవత్సరమునందుఁ బ్రకటింపఁబడిన హిందూదేశముయొక్క భావిస్థితి, యనుగ్రంథమునుండి కొన్నిభాగముల నిందుఁ బొందుపఱచుచున్నాము. ఈగ్రంథమునందు హిందూవిద్యాధికులకోరికలనుగూర్చి మంచివ్యాసములువ్రాయించుటకు” ‘లైడన్‌లా’ యనుపేరున 2000 బహుమతి యొసంగఁబడెను. ఈపరీక్షకై వచ్చిన వ్యాసములలోఁ బ్రధానములగు మూడువ్యాసములు, మాత్రము ఈగ్రంథమందుఁ జేర్పఁబడినవి. అందులో రెండవవ్యాసము హిందూదేశములోఁ జాలకాల ముద్యోగముచేసిపోయిన యొక్క యాంగ్లేయునిచే వ్రాయఁబడినది. ఇఁక ముందుఁదెలుపఁబోవువాక్యములె మీరు గమనింపఁదగినవి,

"హిందూదేశమున కంతకును నాకేనిరంకుశప్రభుత్వము లభ్యమైనయెడల నా నిరంకుశత్వమును గాపాడుకొనుటకు దేశీయులలో నేకజాతీయభావమునే ప్రోత్సాహపరచుచుందును."

అని దొరగారువ్రాసినట్టు లిఖింపఁబడియున్నది. దీనింబట్టి యాంగ్లేయరాజకార్యధురంధరులు తమ పరిపాలనాసౌకర్యమును నిరపాయముగఁ గాపాడుకొనుటకై హిందూదేశీయులలో నేకజాతీయభావమును బోత్సాహపఱచినట్లు తెలియవచ్చినది కదా. ఇందు దొరగారిచే నేకజాతీయతాప్రోత్సాహ మూహింపఁబడినట్లుతోఁచుచున్నదికాని, పాశ్చాత్యపండితు లిది మనకు బోధించినట్లు గ్రహింప పడుటలేదందురా? అటులేని 25-2-1915 రవిపత్రికసంచికయందు "రజస్వలావివాహశాసనము" అనుశీర్షిక క్రింద శ్రీయుత దుగ్గిరాల సూర్యప్రకాశరావుపంతులు బి, ఎ. గారు వ్రాసిన వ్యాసమునుండి మీసందేహమును బాపెడివచనముల నిందుఁ బొందుపఱచుచున్నవారము.

"హిందూదేశమును బాధించుచున్నవి రెండుముఖ్యవిషయములుకలవు. (1) వర్ణభేదము (2) అతిబాల్యవివాహములు. ఈరెండును దేవునికృపవలన స్థిరముగనుండునంతకాలము బ్రిటీషుదొరతనము వారు హిందూసామ్రాజ్యమును నిర్భయముగా నలుపదివేలసోల్జరు పటాలములతో నేలుచు ముప్పదికోట్లజనులీ భరతఖండముననున్నా రనుమాట పాటింపనక్కఱలేదని పాశ్చాత్యపండితులుకొందఱు వ్రాసియున్నారు"

ఇంతవఱకు మేముచూపిన యీముగ్గురివాక్యములవలనఁ దేలినసారాంశ మేమనఁగా.—రాజకార్యధురంధరులును, రాజనీతివిశారదులును నగు పాశ్చాత్యపండితులు తమ పరిపాలనాసౌకర్యసంరక్షణార్థమై మీలో నేకజాతీయత(వర్ణసాంకర్యము)ను స్థాపించుకొనుఁడని మన ప్రజానాయకులకు బోధించినట్లు స్పష్టమైనది. అటుపై సంస్కర్తలు సర్వవర్ణసమావేశపువిందులవలన నేకజాతీయతను నెలకొల్పఁబోయి పూర్వాచారపరాయణుల నిరోధమువలన విఫలమనోరథులై పిదప దీర్ఘాలోచనఁ జేసిచేసి శ్రీయుత భూపేంద్రనాథబోసు గారి ముఖమున సామ్రాజ్యశాసననిర్మాణసభలో నంతశ్శాఖావివాహశాసనమును బ్రవేశపెట్టి యందునను బూర్వాచారపరాయణుల యాటంకముల వలన భగ్నాశులైరి. అంతటఁబోనీక యిప్పుడు శ్రీయుత వి. యస్. శ్రీనివాసశాస్త్రి

బి.ఏ.యల్.టి గారిముఖమున వర్ణసాంకర్యమను మహీపతికి మంత్రియనందగు॥రజస్వలా వివాహశాసనమును చెన్నపురిశాసననిర్మాణసభలోఁ బ్రవేశపెట్టియున్నారుకాని యీవర్ణసాంకర్యమునకై చేసెడిప్రయత్నము చితమనికాని, సంభవమనికాని, చేయఁదగిన దనికాని, కొందఱు సంస్కర్తలును, కొందఱుపాశ్చాత్యపండితులును విశ్వసించుటలేదు చూడుఁడుకృష్ణాపత్రిక సంపుటము 12 సంచిక 21 లో

"ఎప్పుడో యీదేశమునందు హిందువులు, మహమ్మదీయులు క్రైస్తవులు, ఆంధ్రులు, అరవలు, బంగాళీలు, పంజాబీలు, భారతదేశ మందుఁబుట్టినవారెల్లరును నొక్కమతమవలంబించి యొక్కభాషను మాట్లాడి యొక్కయాచారమునుస్వీకరించి యేకజాతీయత నెలకొల్పఁ బడునని కొందఱు సంస్కరణధురీణులు విశ్వసించుచున్నారు. ఇది కేవలముకల్ల. ఇయ్యది ప్రకృతికిఁ బ్రతికూలము. చరిత్రకు విరుద్ధము. ఏకత్వమునుండి యనేకత్వముకలుగుటయె ప్రకృతియొక్కపరిణామము. జ్ఞానాభివృద్ధియైనకొలఁదిని విద్యావ్యాపకము ప్రబలినకొలఁదిని భేదము కూడ వృద్ధినందును. మతములుహెచ్చును. ఆచారములునరిల్లును. అన్యోన్యసంసర్గచేత నన్యమతసహనము, సౌభ్రాతృత్వము ప్రబలవచ్చును కాని భేదరాహిత్యముమాత్ర మెప్పుడును సిద్ధింపనేరదు?........అజ్ఞానులు భేదములను, వ్యత్యాసములను, నిమ్నోన్నతముల యనేకత్వములను, జూచి కలవరపడెదరు"

అని వ్రాయఁబడియున్నది. సంస్కారికులాగ్రగణ్యులగు కృష్ణాపత్రికాసంపాదకులు వర్ణసాంకర్యము ప్రకృతికిఁ బ్రతికూలమనియుఁ జరిత్రకు విరుద్ధమనియుఁ భేదములనుజూచి యజ్ఞానులు కలవరపడెదరనియు నిరూపించియున్నారు. కృష్ణాపత్రిం సంపుటము 12 సంచిక 28 లో శ్రీయుత జి. రామచంద్రరావు ఎం. ఏ. గారిచేఁ బ్రమాణముగా గ్రహింపఁబడిన దొరగారివాక్యములం దీ యేకజాతీయతాప్రయత్నమునుగూర్చి

"భ్రాంతివశులగు భారతీయులు ఎంతకాల మీ యెండమావి (ఏకజాతి)కై ప్రయత్నించుచుందురో యంతకాల మాయజ్ఞానములోనున్న జాతు లెక్కువ జ్ఞానాభివృద్ధినందుచున్న జాతులవారి క్రమాభివృద్ధికిఁ ప్రతిబంధకముగ నుందురని నిశ్చయముగఁ జెప్పఁగలను

ఇట్టి భిన్నజాతులవారలందఱు గలియుటకు ననేక శతాబ్దములుపట్టును. ఈమార్గమున జరుగు వ్యర్థప్రయత్నములచే నానిరంకుశత్వమును జిరకాలము రక్షింపఁగలుగును"

అని దొరగారువ్రాసినట్లు లిఖింపఁబడియున్నది. ఈయుభయుల వాక్యముల వలన మనసోదరులుచేయుచున్న యేకజాతీయతాప్రయత్నము నిరుపయోగమనియే కాక హానికరమైనదనికూడఁ దెలియవచ్చినది.

ఇట్లు సంఘసంస్కారులలోఁ గొందఱిచేతను, పాశ్చాత్యపండితులలోఁ గొందఱిచేతను, నిరుపయోగమనియు హానికరమనియు, నిశ్చయింపఁబడిన యీయేకజాతీయతాప్రయత్నమునకు సృష్ట్యాదినుండియు గర్భశత్రువులయిన పూర్వాచారపరాయణులు కలిగించెడి యాటంకములఁగని కనలి మన సంస్కారసోదరులు తమపట్టు నెట్టులయిన గట్టెక్కించుకొనుటకై పూర్వాచారపరాయణులను నోటికివచ్చినట్లెల్ల దూషించుటకుఁ గడంగియున్నవారు.

* సంస్కర్తలు రజస్వలావివాహఖండనవాదుల నేమనిదూషించుచున్నారు? *

అని యడిగెదరా? వారిచిత్తమువచ్చినట్లెల్ల ముందువెనుకలు విచారింపక దూషించుచున్నారు. వానిలోఁ గొన్నిటినిఁ దూచా తప్పకుండ వినిపించెదము. విని, వానిని మీమనములఁ బదిలముగానిడుకొని యీగ్రంథమును సావధానముగ సాంతముగాఁ జదువఁ బ్రార్థించుచుఁ బ్రకృతమునకు వచ్చుచున్నవారము. కనుంగొనుఁడు. ఆంధ్రదినపత్రిక సంపుటము 1 సంచిక 299 లో "వివాహవిభ్రమోచ్ఛేదనము" అను వ్యాసముఖమునందు శ్రీయుతార్యనారాయణమూర్తిగారు

"కొందఱుశాస్త్రులు రజస్వలావివాహములవలన వర్ణసంకరము గునని సభలలో నుపన్యసించుచున్నవారట. అట్టివారు వేదశాస్త్రము లెఱుంగని నామధారకమాత్రులని మేమిప్పుడు చూపుచున్నారము"

అని మహాపండితులనందఱిని రజస్వలావివాహముల నిషేధించినందులకు పండితనామధారులని తిరస్కరించుట కారంభించినట్లు మీకుఁ దెలియవచ్చినదికదా.

కృష్ణాపత్రిక సంపుటము 18 సంచిక 50 లో "సంఘబహిష్కార" మను వ్యాసమునందు ఎ. పార్థసారధి బి. ఏ. గా రిట్లు వ్రాసియున్నారు.

"బాలికలకు యుక్తవయస్సువచ్చువఱకు వివాహములుచేయవలదనినను విదేశములకువెళ్ళివచ్చినవారిని మతములోనికి రానీయవల

సినదనినను వీలుగాదనియు, వీరు మనగ్రంథము లొప్పుకొనుచుండుట లేదనియు, శాస్త్రములు భేదములుగానున్నవనియు, నీయభిప్రాయములు సర్వజనాంగీకారములు కావనియు నిప్పులఁద్రొక్కిన క్రోఁతులవలె గంతులు వేయుచుందురు."

అని వ్రాసిరి. వింటిరిక దా? మనసోదరులు పండితులను వానరములతోఁ బోల్చుట? ముందు నారాయణమూర్తిగారు పండితులను బామరులలోఁ జేర్పఁగా నీపార్థసారధిగారు వారిని వానరములలోఁ జేర్చియున్నారు. రవిపత్రిక 25-2-15 గలసంచికలో "రజస్వలావివాహశాసనము" అనుశీర్షిక క్రింద శ్రీయుత దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు.

"ఈశాసనము పేరట నిరపరాధులును నబలలు నగు స్త్రీలను దూషించి వారికి నిష్కారణదోషములనారోపించి తమ నైసర్గిక రాక్షసస్వభావమును బ్రత్యక్షముగావించుచున్న బ్రాహ్మణసాతురులు పత్రికాముఖమున సాక్షాత్కారులగుచున్నారు".

అని తెగడియున్నారు, ఇంతటిదూషణకుఁ బాత్రులైయున్న సాతురబ్రాహ్మణులు చేడియలవిషయమై చేసిన దూషణములేవో వింటిరా?

"ఈశాసనము దొరతనమువారి కంగీకారమయ్యెనేని బ్రాహ్మణాదిస్త్రీలు చండాలాదిహీనజాతులవారి సంపర్కము నపేక్షించి కులహీనంగావింతురు"

అనునది. ఈవిషయము సత్యమని యిందు స్వయంవరవివాహములంగూర్చి వ్రాయుచోట నిదర్శనపూర్వకముగా నిరూపించియున్నారము. అటుఁగనుఁడు. తొల్లి పార్థసారథిగారు పండితులను వానరములలోఁ జేర్పఁగా నీ ప్రకాశరావుగారు వారిని నరభక్షకులైన యసురులలోఁగలిపియున్నవారు. సువర్ణలేఖ వారపత్రిక సంపుటము (1) సంచిక 16 లో "దురాచారసంస్కరణము" అనువ్యాసమునందు ఒకసంఘసంస్కర్తగారు వ్రాసిన వ్యాసమునందుఁ బూర్వాచారపరాయణుల కిట్లు చెప్పుచున్నారు. ఏమన?

"మీరు విధవావివాహమునైనఁ జేయుఁడు. లేదా ప్రౌఢావివాహములం గావింపుఁడు. రెండును జేయరా మీకుఁ జీవాట్లుతప్పవు".

అని తెలిపినట్లు వారిమాటలఁజదివినవారికి విదితముగాకపోదు.

"ఆ విధవముండయుద్దేశముకనుగొనుటకంటె నింట్లోయున్న వంటలక్కను వదల్చుకొనఁబ్రయత్నించుట మంచిదని మీపిల్లయందుమీకుఁగలదయాభిమానములనుబట్టి మీరనుకొనుచున్నారా? ఛీ, ఛీ, దుర్మార్గులారా! మీరెట్టిమనుష్యులు ద్విపాదపశువులు.....వెంటనే యామెకురెండవపెండ్లి యెందుకుఁజేయవు? కులములో వెలివేసెదరనుచున్నావా? ఎవరును నీయింటికి రారనుచున్నావా? నీకులముతగలెయ్య, నీదెట్టికులము; నీదెట్టిమతము; అటులైన నామెను భోగినీస్త్రీవలె వదలివేయుదువుకాఁబోలు. ఛీ, నీతిలేనిశుంఠా!"

అని యీవిధముగా సంబోధించి పూర్వాచారపరాయణులకు బుద్ధులఁగఱపుచు

"చేసినవిధవావివాహముం జేయుము. లేదా, నీసోదరీలకుగాని నీపుత్రికలకుగాని యుక్తవయస్సురాకపూర్వము వివాహమెచేయకుము. ఇది వలలోఁ జేసితివిపో. ఆమె నెటులైన నీతిగలిగి సుఖపెట్టఁబ్రయత్నింపుము. అంతేచాలు. వంటలక్కగామాత్రము మార్చకుము. మనశాస్త్రము లీప్రౌఢావివాహముల నంగీకరించుటలేదని యెవరైన యుపదేశించెదరేని నిష్పక్షపాతబుద్ధిగలయొకపండితుని నీక్రిందిప్రశ్నలవేయుము.

(1) పూర్వ మిట్టివివాహము లెందులకుండెడివి?

(2) బాల్యవివాహము లెప్పటినుండిపుట్టినవి?

(3) బాలవితంతువులయవస్థ బాపుటెట్లు?

(4) నేడు ప్రౌఢావివాహముల నెందుకుజేయగూడదు?"

అని ప్రశ్నించియున్నారు. ఈప్రశ్నలలో మూడవదానికిదప్ప మిగిలినదానికి సమాధానములు క్రమముగా నిందువచ్చును గాన నాయాస్థలములయందుఁ జూడఁదగును. వీరివాదములనుబట్టిచూడగాఁ బైముగ్గురివాక్యము లెందులకును గొఱఁగానివిగాఁ గాన్పించుచున్నవి. సూర్యప్రకాశరావుగారు పండితులను నరభక్షకులైనను మనుష్యాకారము గల రాక్షసులలోఁజేర్చియుండగా మన యొకసంస్కర్తగారు రాక్షసులలోనుండి యీడ్చి ద్విపాదపశువులలోనికి నెట్టుచున్నారు. జూచితిరా! మన పూర్వాచారపరాయణులగు పండితు లెంత యధోగతికి వచ్చుచున్నారో? ఇంతటితో మనసోదరులుచేసెడిదూషణము ముగిసినదని యనుకొనుచున్నారా? వలదు, వలదు. వీనినన్నిటినిమించి

నది మఱియొకటికలదు. దానిని వినిపించి యీదూషణప్రసంగమును గట్టిపెట్టెదను. సంఘసంస్కారి పితామహులనఁదగు రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగముపంతులు గారు తమ ప్రథమసంపుటము 422వ పుటలో "హిందూవివాహములు" అనుశీర్షికక్రింద నొక ప్రహసననాటకమును రచించియున్నారు. అందుఁ బాలుదొరగారును మీరాసాహెబుగారును నాటకపాత్రలు, వారిలో పాల్‌దొరగారితో మీరాసాహెబుగా రిట్లు చెప్పుచున్నారు.

"మీరా:— పెండ్లిచేసుకునేవాండ్లిద్దఱు సమ్మతిపడవలెను. ఆలా సమ్మతి లేకుండా బలవంతపెట్టిచేస్తే యేఖరారు చెల్లదు.

పాల్:— వివాహంనాటికి ఆలాంటిసమ్మతియివ్వడానికి శక్తిగలిగి యుండడానికి వారు యుక్తవయస్సువచ్చినవారుగాగూడ నుండనక్కఱ లేదా?

మీరా.— తప్పకుండ ఉండవలెను. ఆలా లేకపోతే వివాహాలే కావు. భాంచోత్ బ్రాహ్మణులలో జేసే పెండ్లిండ్లు యేమిపెండ్లిండ్లండి వాటికంటె బొమ్మలపెండ్లిండ్లైనా మంచివే, పాలుత్రాగే పసిపిల్లను బట్టవిప్పివేసుకొతిరిగే పసిబాలుణ్ణి పల్లకీలో బెట్టి డుయిడుయిమని బాజాలతో ఊరేగించి పెండ్లిఅంటారు"

వింటిరా? మనలింగముగారిప్రసంగము. ప్రజలందఱు పీరికడవఁబోయి మా సంఘమును బాగుచేయుఁడని యీయనను గాగలించుకొని యేడ్చినారా? ఈయనకీసంస్కరణప్రయత్నమేల? ప్రయత్నముచేసిరిపో! యింత వినువెంపుడు? వినువు కలిగెనుబో! యీరీతిగ బూతులంబెట్టనేల? మనయనుభవమునుబట్టిచూడఁ దలిదండ్రులమాటలనే కొందఱుకొడుకులు విననుండుట లోకమునఁ గలదుకదా. ఇట్లుండ నెక్కడెక్కడనో పుట్టి యెక్కడెక్కడనో పెఱిగి యేవియోయభిమానములుకలిగి యుండి ప్రవర్తించెడిప్రజ లొక్కనియభిప్రాయములో నొక్కసారిగ నేకీభవించుట యెక్కాలముననైన నెక్కడనైన మనము కనివినియుంటిమా? లేదు. అటులేని బాల్యవివాహములనుమానుమని బ్రాహ్మణుల కుపదేశించి వారు వినకపోఁగానె భాంచోత్ బ్రాహ్మణులు బాల్యవివాహములఁజేయుచున్నారని దూషింప మొదలిడిరి ఆవెంటనె మఱియొకసంస్కర్తగారు తాము జందెమును ద్రెంపుకొని మీమీ జన్నిద

# ప్రధాన పోషకులు.

1. శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2. శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

**సహాయులు.**

14. కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట.
15. తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
16. వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
17. తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
18. గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కాట్బ్రదర్సుకంపెనీ.
19. ఛేకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమీదీపురం.
20. ఉల్లగంటి వీరరాఘవరావుగారు, మక్తాదారు, ఆనేపురం.

## ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు

1. రెంటాల వెంకయ్యగారు, మాచుగుల.
2. రెంటాల పున్నయ్యగారు, ... ...
3. సూరి పూర్ణానందముగారు, పోలీసుయినస్పెక్టరు, సత్తెనపల్లి.
4. చల్లా సీతారామయ్యగారు, ... ...
5. ముటుకూరి గోపాలకృష్ణయ్యగారు, కరణం, ముటుకూరు.
6. దొడుకూరి బ్రహ్మాందీక్షితులుగారు, గుంటూరు.
7. ముదిగొండ శంకరయ్యగారు, రామన్నపేట.
8. నెల్లుట్ల నరసింహారావుగారు, జొనగాం.
9. దండెంరాజు నారాయణరావుగారు, పిడుగురాళ్ల.
10. రాజశేఖరుని రామకృష్ణయ్యగారు, బ్రాహ్మణపల్లె.
11. ముళ్లపాటి రామనాథరావుగారు, కరణం, ముళ్లపాడు.
12. భాగవతుల గోపాలకృష్ణయ్యగారు, కృష్ణా యూస్టర్న్ సబుడివిజన్ ఆఫీసు క్లర్కు, బెజవాడ.
13. వేమూరు రామచంద్రరావుగారు, ఇంజనీయరుఆఫీసు, గుంటూరు
14. తుళ్ళూరు పిచ్చయ్యగారు, పాతగుంటూరు.

# అభినవసరస్వతి

పత్రికాధిపతి, జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొకమాసపత్రిక—ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును, ప్రకటింపఁబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనఁగలుగు నానందముగాక చందాదారులకు 2-8 అపూర్వగ్రంథము లలభించును. చందాసంవత్సరమునకు రు 2-0-0

ఈకార్యస్థానమున వెలకుదొరకుపుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | అళ్ళియాచార్యవిజయము | ... ... | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరె వీరభద్రకవి) | ... ... | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } | ... ... | 0-4-0 |
| 4 | కంసవధము } ఇవి రెండు నాటకములు | ... | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి ( సింహాద్రి వెంకటాచార్యులు ) | ... | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... ... | 0-2-0 |
| 7 | నీతిగీతులు. ( సుమతి శతకమునకు సంస్కృతము ) | ... | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | ... | 0-2-0 |
| 9 | అత్యద్భుతవిమర్శనము (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు. వెంకటరామకృష్ణకవులయవధానములపైవిమర్శనము } | ... | 0-5-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము ( పత్రికాధిపతి ) | ... | 0-4-0 |
| 11 | సంగదోషము. ( సంగదోషముచే బట్టుదలవదలనియోగుల చరిత్ర దెలుపు నొకచిన్న పద్యరూపముగు కథ } | ... | 0-3-0 |
| 12 | వీరభాగవతము ( ముదిగొండ వీరభద్రకవి ) | ... | 1-4-0 |
| 13 | పుళిందావివాహము ( పత్రికాధిపతి) | ... | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | | 0.4-0 |
| 15 | శివానందలహరి. ( తంగెడ రామకృష్ణకవి ) | ... | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము( రాయసము వెంకటపతి ) | ... | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము ( తిరుపతి వెంకటీయము )... | | 0-3-0 |
| 18 | పశ్యంపుశ్యాం | ,, | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ,, ... | 0-2-0 |
| 20 | వేమవరాగ్రహార శతావధానము | ,, ... | 0-12-0 |
| 21 | పురశ్చరణము | ,, | 0-2-0 |

వలయువారలు సొమ్ముపంపిగాని, వి. పి. ద్వారాగాని, ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.

బుణ్యాచారిత్ర! యత్యంతపూజ్యమైన
ధారణాయోగమునియంద్రము తత్త్వవిదులు॥ 187

వ॥ మఱియు వేదంబులచేత నే లోకంబులును దేవతలును నరులును భరియింపంబడిరి. అట్టివేదంబులు శివుండెయని తెలియుటయు నొక్క ధారణయగు. దేహేంద్రియబుద్ధ్యాదు లేంగా నహంకారవర్జితంబగు శుద్ధబ్రహ్మచైతన్యం బేనని యెఱుంగుట పరమధారణయని వేదంబు లుపన్యసించు. సర్వశాస్త్ర విశారదుండవగు నీకు నాగమాంతైక సిద్ధంబగు నీసర్వంబు సంక్షేపంబుగా వచించితి. నీవును దీనిననుష్ఠింపవలయు. ఇంక సంసారతరణకారణంబైన ధ్యానయోగం బుపదేశించెద సావధానుండవై విను” మనియుమ్మహేశ్వరుం డిట్లనియె. 188

## ధ్యానయోగవిధి

శా॥ ఆకాశంబున నిర్మలాకృతియు శీతాంశుచ్ఛటాపూర్ణమా
రాకాపూర్ణశశాంకమండలము(మీాఁదన్ దాని) మధ్యంబునన్
లోకాతీతు నుమాసహాయుఁ గరుణాలోకాన్వితున్ శంకరున్
శ్రీకల్యాణఫలప్రదానచతురుం జింతింపఁగానొప్పగున్॥ 189

సీ॥ సాంద్రజటాసక్తచంద్రఖండమువాని
రమణీయలోచనత్రయమువాని
నీలాళినీలాబ్జకాలకంఠమువానిఁ
జారుబాహాచతుష్కంబువాని
స్ఫటికాంశుజాలవిస్ఫురదంగరుచివాని
సితిసురక్షణాలయస్థితులవాని
పార్వతీయుతవామభాగంబుగలవాని
ఘనసదానందవిగ్రహమువాని
శివు మహాదేవు దేవతాసేవనీయు
నాపరానందు సద్భక్తపాపహరణు

"సోహ" మనువాక్యతాత్పర్య మూహఁ జేసి
ధ్యానమొనరింపవలయు విజ్ఞానలీల॥ 190

వ॥ అదియునుంగాక, 191

దండకము॥ శ్రీమన్మహాకాశమధ్యంబునన్ భ్రాజమానప్రభాశోభ
నంబై లసల్లక్షవిఖ్యాతసద్యోజనాయామమై పూర్ణమైనట్టి భాస్వన్మహా
మండలాంతఃప్రదేశంబునన్ లోకధాత్రాఖ్యు నీశున్ సువర్ణాభమూర్తిన్
హిరణ్యాభభాస్వన్నఖశ్మశ్రుకేశున్ మహాదేవుఁ గన్యాసవక్త్రున్ శివున్
నీలకంఠున్ మహాలోహితుండౌ సదాగోపబాలప్రసిద్ధున్ మహాసిద్ధసంబా
ధదేహున్ విభున్ "సోహ"మం చెప్పెడున్ సంధ్యలన్ ధ్యానముం జేయఁగా
నొప్పు సద్వేదికంబై విశుద్ధంబునౌ నగ్నిహోత్రాదిమధ్యంబునం దాత్మ
మూర్తిన్ జగత్కోటికాధారమౌ వాసినానందబోధానుభూతిన్ విరూపా
క్షు గంగాధరున్ విశ్వరూపున్ వృషాధీశకేతుం జతుర్బాహుఁ జంద్రా
ర్ధమౌళిం గపర్దిన్ సదాత్ముం ద్విరుద్రాక్షమాలాలసత్కంఠు గోక్షీరఫేనప్ర
కాశున్ మహీంధ్రాత్మజాధీశు గుహ్యాతిగుహ్యున్ విసర్వ్యందువ్యా నాసీను స
త్యద్భుతున్ శంకరుం దన్నుఁగా ధ్యానముం జేయుటొప్పు, కాకున్న సర్వ
జ్ఞుఁడై తా సహస్రాక్షశీర్షాంఘ్రియై విశ్వమై యక్షరుండై మహావిష్ణువైన
ట్టి నారాయణుం డేనయంచున్ హృదంభోజమధ్యంబునం దేదృఢధ్యా
నియౌటొప్పు, కాకున్నఁ దాఁ బ్రాణసంరోధవృత్తిన్ స్ఫుటంబై శివా
వాసమై విద్యయుం గేసరంబుల్ మహైశ్వర్యపత్రంబులున్ జ్ఞాననాళం
బసత్కందముం గల్గి యోంకారసద్బోధ్యమౌ స్వాంతకంజాతమధ్యంబు
నందుండ విశ్వార్చియై వహ్నియై విశ్వతోవక్త్రమై లోకయోనిత్వముం
జెంది వైశ్వానరుండై శిఖాతన్వియై యాశుఁడై స్వాంగమాపాదశీర్షం
బు తాపంబు నొందించి నిర్వాతదీపంబు చందంబునన్ నీలమేఘస్థవిద్యు
త్ప్రభారూఢి నీవారశూకాభ రూపంబునుం బీతవర్ణంబునౌ నమ్మహావ
హ్ని ధ్యానించి తద్దివ్యతేజశ్శిఖా మధ్యదేశంబునం దాపరానందరూపా
త్మతేజంబు దా నాపరాకాశమై సత్యమై బ్రహ్మమౌ నమ్మహాపూరు

ఘనుం గృష్ణపీతాకృతిన్ సాంబు సంసారరోగచ్ఛిదున్ విశ్వరూపున్ మహేశున్ విరూపాక్షుఁడౌ నూర్ధ్వరేతస్కునిన్ నీలకంఠుం దనుం దాను వీక్షించుఁ బాపఘ్ను బ్రహ్మచ్యుతేశానసంపూజ్యు దేహాతిరిక్తున్ శివున్ "సోహ" మంచెంతయున్ యోగిరాడ్ధ్యేయు ధ్యానంబు సేయంగ నీమార్గమే ముఖ్య మయ్యాగమాంతైకసంసిద్ధ మైయొప్పు, కాకున్న "లోకేశుఁడౌ బ్రహ్మ నే"నంచుఁ జింతింపఁగా నొప్పు, కాకున్న స్వస్వాంతమధ్యంబునందున్ శివున్ సాక్షి సంసారవేద్యున్ జగత్కారణున్ సాంబు "నే"నన్న బుద్ధిన్ విముక్త్యర్థమై ధ్యానముం జేసి యీశాను నవ్యక్తు నానాంతమూర్తిన్ లసత్స్ఫూర్తియా నాదిమధ్యాంతశూన్యున్ సదాధారు నాధారు శూన్యాకృతిన్ నాత్మునిన్ శబ్దమున్ స్పర్శమున్ రూప మింపౌరసంబున్ లసద్గంధముం గాక సామ్యంబు లేకంతయున్ దానయై విశ్వరూపుండునై మూర్తియై మూర్తిగాకుండి తా దృశ్యుఁడయ్యు న్నదృశ్యత్వముం జెంది యంతర్బహిర్వ్యాప్తుఁడై సర్వతోవక్త్రుఁడై సర్వతఃపాణిపాదుండునై సర్వహేత్వైకహేతుండునై సర్వసంవేదియౌ శ్రీమన్మహాదేవుఁ డేసంతు ధ్యానంబుగావించు నీమార్గమే ఘోరసంసారమాయాపినాశప్రకాశంబు, గాకున్నఁ దా సచ్చిదానందమై ధ్యానగమ్యంబుగాకుండు తద్బ్రహ్మమేనంచుఁ జింతింప ముక్తుండగున్, దీనినొక్కప్పుడైనన్ మదిన్నిల్పి ధ్యాసింపఁగా బ్రహ్మసాయుజ్యముం గాంచునంచున్ శ్రుతుల్ పల్కు నత్యంతమున్ ధ్యానముం జేయ సాక్షాచ్ఛివుండౌను, లోకంబులో దీనితో సాటిలేదెందు, పాపాత్ములౌ వారికీ నార్తలన్నన్ మహాసహ్యమౌ, పుణ్యులౌ వారికిన్ ధ్యానమున్ జ్ఞానమింగొక్కరీతిన్ మహావిష్ణు నవ్యక్తు నారాధ్యు సర్వప్రభున్ శంఖచక్రాబ్జహస్తున్ సునేత్రుం గిరీటాంగదశ్రేష్ఠహారాభిరామున్ (ల)సత్పీతవస్త్రున్ హరిన్ బూర్ణచంద్రాననున్ దేవు శ్రీవత్సవక్షున్ సరోజాతనేత్రుం బ్రసన్నున్ సమందస్మితున్ స్ఫాటికాచ్ఛచ్ఛవిం జక్రి నేనంచుఁ జింతింపఁగా ముఖ్య మీధ్యానమౌనంచు

యోగీంద్రు లత్యంతముం జెప్పఁగా నొప్పు, ఇంకొక్కరీతిఁ సుపర్వాది నాథుఁ విరించిఁ వరాభీతిహస్తుఁ లసత్కుండికాహస్తు నయ్యక్షమాలాధరుం గుంద్రచంద్రప్రభాకారు వాణీసమాసక్తు నద్దేవు నేనంచుఁ జింతింప, సగ్గుర్వృచంద్రాళివేదోక్తమార్గంబుచేఁ దన్నుఁగాఁ జింతసేయందగుఁ, నిత్య మీలీల నభ్యాసయుక్తాత్ముఁడౌ యోగికిం దాఁ గ్రమంబొప్పఁగా వేదవేదాంతవిజ్ఞానముం గల్గు, సందేహముఁ లేదు, జ్ఞానంబు చేగాక యజ్ఞానముం బోవ దజ్ఞానవిచ్ఛిత్తి యే ముక్తియూ, నీకు వేదాంతసారంబు సర్వంబునుం జెప్పితిఁ, మత్ప్రసాదంబునఁ సందియంబొందకానందివై చెందుమా డెందమం దీశ్వరానందబోధంబు వాచస్పతీ!" యంచుఁబల్కెఁ మహాదేవుఁ డానందియై. 192

—♦సమాధి♦—

తే॥ ఇంక మీఁద సమాధి నే నెఱుకపఱతు
జీవపరులకు నైక్యతాసిద్ధిఁ జేయు
జ్ఞానమె సమాధియనియందు మానివరులు
దీనభవనాశనం బొను దేవపూజ్య! ॥ 193

తే॥ పరజీవద్వితీయత్వ మొప్పు వెందు
జీవపరులకు భేదంబుఁ జేసి నేస
ఘటము వ్రాలెనచిత్త్వంబుగలుగు, దాన
భయవినాశంబు లగునని పలుకు శ్రుతులు॥ 194

క॥ నిత్యుండు దోషరహితుఁడు
సత్యుఁడు కూటస్థుఁ డజుఁడు సర్వగుణాత్ముం
డత్యంతశుద్ధుఁడయ్యును
నిత్యజ్ఞానంబుచేత నెఱి భిన్నుఁడగుఁ॥ 195

సీ॥ అట్లాట నద్వైతమగు బ్రహ్మమునందును

జగములసంస్మృతియును మిగులమిథ్య

గగన మొక్కటియయ్యు ఘటమఠాకాశంబు
లగుగీతి భ్రాంతిచే నాత్ముఁడొక్కఁ
డయ్యును జీవేశ్వరాత్ముఁడై భిన్నుఁడో,
ప్రాణంబు లింద్రియపంక్తి తనువు
మనసు చిత్తము బుద్ధి మఱి యహంకృతియును
ఖానిలానలతోయ గధవతులు
శబ్దమును రూపస్పర్శముల్ సరసరసము
గంధమును మాయ సంసృతి గాను నేను
సాక్షినగుటనుశివుఁడ నిస్సంశయముగ
ననెడుబుద్ధి సమాధియా ననఘచరిత!॥ 197

సీ॥ అదిగాక పంచభూతావిర్భవంబైన
యండంబు పంచభూతాత్మకముగ
ఘనవివేకాగ్నిచే కాలిచియభ్భూత
ములసూక్ష్మభూతాళిఁ గలయఁజేసి
యాసూక్ష్మభూతంబు లరసిమాయనుఁగూర్చి
యామాయఁ బత్యగాత్మార్పణంబు
చేసి యాబ్రహ్మంబెచింతింపఁగానాముఁ
గాని సంసారినిగాను నేన
టంచుఁదనుదానచూచిన నగుసమాధి
ఇంక నొకరీతిఁదెలిపెద నెఱఁగికొనుము
చిత్తమేకాగ్రముగ మహాహ్లాదా త్తచరిత !
సర్వగీర్వాణవందితచరణకమల! ॥ 199

వ॥ మఱియు నోంకారాత్మకుండగుసీశ్వరు నకారాదివర్ణత్ర యాత్మకుంగఁదెలిసి యకారోకారమకారనాదంబుల ఋగ్యజుస్సామాధర్వణంబులఁగానెఱింగి యకారంబుబ్రహ్మయు నుకారంబువిష్ణుండును మకారంబురుద్రుండును నాదంబుకారణంబుగాఁ దలంచి యగ్ని

త్రయలోకత్రయావస్థాత్రయోదాత్తాదిస్వరత్రయకాలత్రయంబుల వర్ణత్రయాత్మకంబుగా విమర్శించి సర్వంబు నక్షరత్రితయాత్మకంబగుట నయ్యక్షరంబులం దకారంబు నుకారంబునం దుకారంబు మకారంబునం దామకారంబు నాదంబునం దానాదంబు మాయయందు మాయ జీవునియందు జీవునీశ్వరునం దాపాదించి యయ్యీశ్వరుండ నేనని స్వానుభూతిం దెలిసిన నిదియే వేదోక్తంబగు సమాధియని విద్వాంసులు వచింతు రింకొకవిధానం బెఱింగించెద. 198

పంచచామరము॥ పయోధిలోనఁ బుట్టి ఫేనపంక్తి యాపయోధిలో
లయించినట్లు నాదులోఁ బలుకుజగంబు పుట్టు తా
లయంబునొందు విశ్వమాయలందలంప నేనె ని
శ్చయంబటంచు దోఁచు తెల్వి తత్సమాధి యైతగుఁ 199

వ॥ సర్వగంబగు చైతన్యంబు మనంబున సార్వకాలంబున నేకరీతి నెప్పుడుం బ్రకాశించు నప్పుడయ్యోగీంద్రుండు తన్నుం దాఁ జేరు, సర్వభూతంబులందుం దనను దనయందు సర్వభూతంబుల నెప్పుడుం జూచు నప్పుడు బ్రహ్మంబునొందు, సమాధిస్థుండు పరుచితో నేకీభూతుండైన సర్వభూతంబుల నెప్పుడుం జూడకుండు నప్పుడు కేవలుండగు, ఎవ్వని కైన హృదయగతంబులగు కోరిక లెప్పుడు నశించు నప్పు డప్పురుషుం డమృతీభూతుండై క్షేమంబునొందు, భూతంబులపృథగ్భావం బేకస్థంబుగా నెప్పుడుఁ గను నప్పుడ విస్తారంబగు బ్రహ్మంబునొందు, పరమార్థంబువలనఁ దనను గేవలుంగా సర్వజగంబును మాయామాత్రంబుగా నెప్పుడెఱుంగు నప్పుడే పరమనిర్వృతిం బ్రాపించు, జన్మమృత్యుజరావ్యాధుల కేకభేషజంబగు కేవలబ్రహ్మజ్ఞానం బెవ్వనికిం జనించు నతండు సదాశివుండగు, అజ్ఞాత విజ్ఞానంబునం గాని కర్మకోటులను ముక్తిసంభవింపదు, కర్మసాధ్యంబునకు నిత్యత్వంబు సంభవింపదు, వేదాంతవిజ్ఞానంబె జ్ఞానంబు, ఇతరం బజ్ఞానంబెయగు, మఱియును, 200

తే॥ అహాహా! జ్ఞానప్రభావంబులను వచింప
నాకుశక్యంబుగాదు లోకైకపూజ్య!
అల్పదీపంబుతమములనణఁచినట్లు
జ్ఞాన మింతైన బహుళదోషంబులణఁచు॥ 121

చ॥ అనియదవాగ్నికీల (లిల) లార్ద్రము శుష్కము గాల్చురీతి దు
స్తరతరపుణ్యపాపముల దగ్ధముసేయును జ్ఞానవహ్ని వి
స్ఫురదురుమంత్రసిద్ధుఁ డహిపుంజముఁ బోఁ గారించి తద్భయం
బెఱుఁగనియట్లు తత్త్వవిదుఁ డింద్రియసంగతుఁడై యలిప్తుఁడౌ॥ 122

క॥ జలములనుండియు జలజము
జలమంటనియట్లు విషయసంగతుఁడయ్యు౯
దొలఁగును విషయభ్రాంతిని
దలపోయఁగ బ్రహ్మవిదుఁడు ధన్యుఁడుకాఁడే॥ 123

తే॥ తనర భక్షించువిషము మంత్రౌషధముల
జీర్ణమగురీతి యోగికిజీర్ణమగును
సర్వపాపవ్రజంబులు క్షణములోన
తన్మహాత్త్వంబువర్ణింపఁదరమె జగతి॥ 124

సీ॥ వినుచును ముట్టుచుఁ గనుచు భక్షించుచు
గంధంబుగొనుచును గమనకర్మ
మొనరించుచును బల్కుచును బట్టువిడుచుచు
నిద్రించుచును దేవ్వనిలఁపుగొనుచు
మూయుచుఁ దెఱచుచు వాయువునవుచు
విహితకర్మంబులఁదవులుకొనుచుఁ
గర్తనుభోక్తను గానసంగుఁడనేను
సర్వేశ్వరుండ మత్సన్నిధాన

మున జేష్టింపు నింద్రియంబులు దలంప
ననేకవిజ్ఞాన మొదవి(తానయి యసంగి)
పాపములుచేసెనేని నిర్లేపుఁడగును
జలజపత్రంబుమునుఁగునే జలములందు॥ 125

క॥ ఇటువంటితత్త్వవేదికిఁ
బటువృత్తివిరోధులైనపాపాత్మకులు
త్కటరౌరవఘననారక
ఘటనంబునఁగాలువారు కల్పములు వెసన్॥ 126

తే॥ అరయుసద్వృత్తి సద్వృత్తియైననేమి
యజ్ఞుఁడైనను బాడితుండైననేమి
జ్ఞానమభ్యాస మొనరించుమానవుండు
శ్రేష్ఠుఁడగు, జ్ఞానశీలునిఁజెప్పనేల॥ 127

క॥ నిరపేక్షు దాంతు శాంతుని
నిరుపద్రవు సముని మౌని నిత్యము వెంటన్
దిరుగుదుఁ దదంఘ్రిరేణు
స్ఫురణపవిత్రంబటంచు సురగురువర్యా॥ 128

క॥ రాజు జనావళిచేతను
బూజితుఁడగు, యోగి పూజ్యుఁడు దివిష
ద్రాజికి, వానికిసరిగా
భూజనములలోన లేఁడు భూరిగుణాఢ్యా!॥ 129

తే॥ ఎవనిగేహంబునకు జ్ఞాని యేగుచుండు
వానిపితరులు స్వర్లోకవాసులగుచు
సమ్యగానందమునుబొంది శాశ్వతముగ॥
గ్రీడచేతురు దేవతాకీర్తనీయ! 130

కల్పితమేకాని యట్టి మూలవ్యాఖ్యానములు కనఁబడవు ఎందులకని యజ్ఞుల మోహపెట్టెదవు? గీతలలోఁగూడ నొక్కొక్కనికే యవస్థా తారతమ్యముచే సాధనము లుపదిష్టములయియున్నవి. అందు ద్వాదశాధ్యాయమున, శ్లో॥ యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తంపర్యుపాసతే। సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలంధ్రువం॥ సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్రసమబుద్ధయః। తేప్రాప్నువంతిమామేవ సర్వభూతహితే రతాః॥ అనుశ్లోకద్వయముచేఁ గేవలజ్ఞాననిష్ఠులును నత్యంతోత్తమాధికారులు నగు వారిస్థితిని బ్రహ్మప్రాప్తియందు వారికిఁగల స్వాతంత్ర్యమును జెప్పి, శ్లో॥ యేతుసర్వాణికర్మాణి మయిసన్యస్యమత్పరాః। అనన్యేనైవయోగేన మాంధ్యాయంతఉపాసతే॥ తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్॥ అను శ్లోకముచే జ్ఞాననిష్ఠులతోఁ దుల్యులు గాని సగుణోపాసకులస్థితిని స్వకర్తృక తత్సంసారోద్ధరణమును జెప్పి యా సగుణోపాసనయందుఁగూడ నశక్తులగు వారికి, శ్లో॥ అథచిత్తం సమాధాతుం నశక్నోషిమయిస్థిరం। అభ్యాసయోగేనతతో మామిచ్ఛాప్తుంధనంజయ!॥ అను శ్లోకముచే సాధనాంతరముంజూపి యందు గూడ నశక్తులగువారికి, శ్లో॥ అభ్యాసేప్యసమర్థోసి మత్కర్మపరమో భవ। మదర్థమపికర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥ అనుశ్లోకముచే సాధనాంతర ముపన్యసించి యందుగూఁడ నశక్తులగు నంతకన్న యల్పులకు శ్లో॥ అథైతదప్యశక్తోసి కర్తుంమద్యోగమాశ్రితః। సర్వకర్మఫలత్యాగం తతఃకురుయతాత్మవాన్॥ అనుశ్లోకముచే సర్వకర్మఫలత్యాగరూపమగు సాధనాంతరముం జెప్పెను. అందు, శ్లో॥ అభ్యాసేప్యసమర్థోశియనుశ్లోకవుభాష్యమున "కేవలము నాకొఱకైనను గర్మలఁ జేయుచు జ్ఞానప్రాప్తిద్వారమున సిద్ధినిబొందఁగల"వని చెప్పఁబడియున్నది. త్రయోదశాధ్యాయమున, శ్లో॥ ధ్యానేనాత్మనిపశ్యంతి కేచిదాత్మానమాత్మనా అన్యేసాంఖ్యేనయోగేన కర్మయోగేనచాపరే॥ అన్యేత్వేవమజానంతశ్శ్రుత్వాన్యేభ్యఉపాసతే। తేపిచాతితరంత్యేవ మృత్యుంశ్రుతిపరా

యణాః॥ అనుశ్లోకద్వయమున నవస్థాభేదముచేతనే సాధనతారతమ్యము చెప్పఁబడినది. ఈపైనిజెప్పిన సాధనములలోఁ బ్రతిమాదులయందలి చిత్తసమాధానముకూడ నొకటి—9వ శ్లోకములోని యభ్యాసయోగేనయనుపదమునకొక యాలంబనమందుఁ జిత్తస్థిరీకరణమని శంకరులుచేసిన భాష్య మీయంశముం జెప్పుచున్నది. ఆభాష్యమందలి యాలంబనశబ్దమున కర్థముస్థూలమగు ప్రతిమాదికమని యానందగిరులవారిచే, టీకవ్రాయబడెను. కేవలప్రతిమోపాసకులే యల్పబుద్ధులు కారు. పూర్వోక్తరీతిని గేవలజ్ఞాననిష్ఠులుతప్పఁ దారతమ్యభేదముచే నందఱు నల్పబుద్ధులే. వారినిగూర్చియే యనేకవిధములగు నుపాయములు-కనుకనే యోగినాంహృదిదైవతమనువాక్యశేషముచే యోగులకును హృదయరూపమగు నొకస్థానమందే యుపాసనము చెప్పఁబడియున్నది.ఆయోగులునుదత్త్వముం దెలిసికొనుటకసమర్థులే. ఇందునారాయణమందలి దహరంవిపాప్మం పరవేశ్మభూతమనుచోట విద్యారణ్యులు తత్త్వముదెలిసికొనుటకసమర్థుఁడగువానికే హృదయమం దుపాసన చెప్పఁబడినదనివ్రాసినభాష్యము ప్రమాణము. జ్ఞాననిష్ఠుల కట్లుకాదు. సర్వత్రసమచేతసామిత్యాదివాక్యములచే వారి కొకప్రదేశము నిర్దేశింపఁబడియుండినదికాదు. గీతలయందుఁగూడ "విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తినిశునిచైవశ్వపాకేచపండితాస్సమదర్శినః"అనుశ్లోకమున జ్ఞానులస్థితి చెప్పఁబడియున్నది. బుద్ధియందు స్వల్పత్వముగాని మహత్త్వముగాని సహజమైయుండదు. ఆ స్వల్పత్వమహత్త్వము లుపాస్యదేవతాస్థానభూతవస్తుకృతములు, ఇదియునుంగాక యగ్న్యాద్యుపాసనయీశ్వరబుద్ధిచేఁజేసిన ఫలమునిచ్చునుగాని యగ్నిత్వాదిబుద్ధిచేఁజేసిన నీయదు, కనుకనే షట్స్వతేషుహరేస్సమ్యగర్చనంమునిభిస్స్మృత" మని విష్ణువునకే తత్తత్స్థలములలోఁ బూజ్యత్వము చెప్పఁబడియున్నది.

త్రైవర్ణికులకుఁ బ్రాణాహుతులువేసికొను కాలమందుఁ బ్రత్యహముఁ బ్రాణాది పంచదేవతారాధనము కొఱకుండఁగనే తటస్థమగుచున్నదికావునఁ బరాశరమాధవీయా

క్త దేవతారాధనము బ్రహ్మబంధువిషయము, ఇట్లే పాంచరాత్రాది షడ్దర్శనపూజా విషయమందుఁ జూచుకొనునది.

అని కామశాస్త్రిగారేది వ్రాసిరో యది మిగుల నసంబద్ధము. ఇదియు వైశ్వానరాద్యుపాసనాఽపరిజ్ఞానముచేతనే వ్రాయఁబడినది. త్రైవర్ణికసామాన్యమునకుఁ బ్రాణాహుతులకాలమునఁ బ్రాణాదిపంచదేవతారాధన సంభవింపదు. ఐనను జడోపాసనాద్వేషికిఁ బ్రాణాదిరూప జడపంచదేవతోపాసనచేమాత్ర మేమిలాభముండును? శాస్త్రిగారి కుండినద్వేషము కేవలప్రతిమార్చనయందేకాక నిబంధనకర్తలగు మాధవాచార్యప్రభృతులయందుఁగూడ నున్నట్లు కనఁబడుచున్నది. లేనిచో సర్వజ్ఞశిరోమణులగు మాధవాచార్యులచేఁ జెప్పఁబడిన యుత్తమబ్రాహ్మణవిషయమగు దేవతారాధనము బ్రహ్మబంధువిషయమని యేలచెప్పను? కనుకనే మాధవాచార్యోదాహృతవచనములు పరాశరస్మృతితుల్యప్రమాణములుకావనిగ్రంథాదియందే వ్రాసెను. పరాశరులయందుమాత్రము శాస్త్రిగారికెట్టుగౌరవముండును? వారును "షట్కర్మాభిరతః, సంధ్యాస్నానం" అనుశ్లోకద్వయముచే వైదికకర్మలమధ్యనే దేవపూజం బ్రతిపాదించిరి. అది బ్రాహ్మణబ్రువవిషయమని వారుచెప్పలేదు. ఇదియంతయు శాస్త్రిగారి యపూర్వపాండిత్యబలముననే సంపాదింపఁబడినది. కావున మూలకర్తయందును శాస్త్రిగారి మనస్సున ద్వేషముండినట్లే యూహింపనయ్యెడిని. భక్తిహేతువులగుటఁ బాంచరాత్రాద్యాగమములును బూజాదిరూపవేదావిరుద్ధాంశములలోఁ బ్రమాణములనుట యిష్టమేయని యుత్పత్త్యసంభవాధికరణమున శంకరచరణులుచెప్పినట్లు వ్రాసియేయుంటిని. శ్లో॥ శైవంచవైష్ణవంశాక్తంసౌరంవైనాయకం తథా। స్కాందంచభక్తిమార్గస్య దర్శనానిషడేవహి॥ అనుస్మృతి యిందుకుఁ బ్రబలనిదర్శనము. భక్తిలేక జ్ఞానముదయింపదని "శ్రద్ధాభక్తిధ్యానయోగాదవేహి" యనుశ్రుతియు "భక్త్యాత్వనన్యయాశక్య"యనుస్మృతియుఁ జెప్పుచున్నవి, ఈతరువాత శాస్త్రిగారి గ్రంథము.

ఇదియునుంగాక స్మార్తోక్తషట్కర్మ సంఖ్యాపూరణార్థమై వర్తమానకాలమందంతటం గ్రమముగా స్ఫటికలోహసాలగ్రామశోణభద్రబాణరూపములగు పంచోపలములను బహిర్వేదికయందుంచి పూర్వోక్తపంచదేవతారాధనముం జేయుచున్నవారు కదా? ఇక్కడసందేహము- ఈవిషయమం దీగ్రంథమునం బూర్వమే పంచదేవతలనం బ్రాణాదిపంచకమేయని సకారణముగా విశదీకరించియుంటిని-ఆపంచప్రాణముల ప్రతినిధిరూపముచేతనే యుదాహృతపంచోపలములు పరికల్పింపంబడుచున్నవా? లేక యాయుపలస్వరూపమే పంచప్రాణములకుంగలదా? అట్లుగానిచో శిష్టులుకూడం దదాచారమేలస్వీకరింతురు? బాఢము-అదిసమంజసముకాదు-ఏలయన? ప్రాణములు వాయురూపములును నమూర్తములును నగుటచే వానికి స్వరూపకల్పన న్యాయ్యముకాదు-ప్రమాణాంతరము లేమినికని తద్దేవతాప్రతినిధిరూపముచే నిరూపించుటకును వీలులేదు.

అనియున్నది-పూర్వోక్తదేవతాపూజ శ్రుతిస్మృతివిహితమగుటవలననే చేయంబడుచున్నదికాని స్మార్తోక్తసంఖ్యాపూరణార్థమై మాత్రము కాదు పంచాయతనపూజ పంచద్వారపాలపూజకంటెం జాల విలక్షణమైనదని పూర్వమే ప్రతిపాదింపంబడినది. సాలగ్రామాదులు ప్రాణాదిప్రతినిధులా? లేక ప్రాణాదులు తత్స్వరూపములా? యనిచేసినవికల్పద్వయము। వంధ్యాపుత్రవివాహాదివిషయక వికల్పతుల్యమగుచున్నయది. శాస్త్రిగారుచేసినవికల్పములే శిష్టాచారప్రయోజకములైయుండలేదు. తత్పూజావిధాయక శాస్త్రమే శిష్టాచారమునకుం గారణము-సాలగ్రామాదిపూజ వర్తమానకాలమందేకాదు. అనాదికాలమునుండి యేయున్నది. శ్లో॥ యఃపూజయేద్ధరించక్రే సాలగ్రామసముద్భవే రాజసూయసహస్రేణ తేనేష్టంప్రతివాసరం॥ మహాకాష్ఠస్థితోవహ్ని ర్మంథస్థానేప్రకాశతే యథాతథాహరిర్వ్యాపీ సాలగ్రామేప్రకాశతే॥ వినాతీర్థైర్వినాదానైర్వినాయజ్ఞైర్వినామఖైః। ముక్తిం యాతినరోవశ్యం సాలగ్రామశిలార్చనాత్ ॥సాలగ్రామసమీపేతు క్రోశమాత్రంసమంతతః। కీకటేపిమృతోయాతి వైకుంఠభవనంప్రతి॥స్థిరలింగేసదాకార్యం సిద్ధికామైఃప్రయత్నతః భుక్తిముక్తిప్రదంపుణ్యం చరలింగేశివార్చనం॥ సర్వత్రసంస్థితఃపూజ్య స్సర్వాధారేషుసర్వదా। తథాపి